# విశ్వ విద్యాలయము




విశ్వ విద్యాలయము

రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



# విశ్వ విద్యాలయము

రచయిత : **త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు




ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-42 రెండవ ముద్రణ : మార్చి-2020

ప్రతులు : 1000 **వెల : 65/-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) సుప్రసిద్ధి బోధ.
99) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
100) 100, శతము, 100.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు
*(DVD'S)*

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ, 28. తాత,
29. తల్లి, 30. భయం.
31. ఆత్మపని, 32. బట్టతల.
33. యాదవ్, 34. జ్ఞానశక్తి.
35. సమాధి, 36. 6-3=6.
37. సంతకము, 38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము, 40. తోలేవాడు.
41. తల్లి తండ్రి, 42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ, 44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి, 46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము, 48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు, 50. పురుషోత్తమ.
51. మతద్వేషము, 52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ, 54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు, 56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి, 58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు, 60. దశ-దిశలు.
61. మాట-మందు,
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.

106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు
మత సాంప్రదాయములు.
128. ఆహారము నీకా!
నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య. 132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం. 138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము.
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. కుశాల్ కుశాల్ లంజమ్మ
నా నెత్తిమీద రెండు తన్నమ్మ.
146. రాజాధి రాజా - దేవాధి దేవా.
147. ఎనిమిది మంది భార్యలున్న
శ్రీకృష్ణునికి గోపికల మీద ధ్యాస ఎందుకు?
148. కులం-మతం, 149. గుడి.
150. గురుపౌర్ణమి సందర్భముగా మీటింగ్
151. భగవంతుడు ఎవరు?
152. విశ్వదాభిరామ వినుర వేమా.
153. కాలం, 154. యమధర్మ.
155. కుడి ధర్మం-ఎడమ ధర్మం
156. ఇందుత్వము అందరిలో కలదు-
హిందుత్వము కొందరిలో కలదు.
157. ధర్మములు మూడే ఉన్నవి
అధర్మములు ఆరు అయినవి?
158. నేను-నా తండ్రి-నా తాత,
నేను-నా అమ్మ-నా అవ్వ.
159. ఆద్య ఆత్మీకము-ఆధ్యాత్మికము,
ఆద్య దేవీకము-ఆద్యేవీకము.
160. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 9704651223, 9542385963

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**LAVANYA KANUMURI**
Cleveland, Ohio, U.S.A,
+1(440) 427 1158.

**S. RAGHU RAMI REDDY**
Seattle, WA, U.S.A,
+1 (425) 698 0375.

# విశ్వ విద్యాలయము

మేము చిన్నవయస్సులో ప్రాథమిక పాఠశాలకు (Primary School) పోయి అక్షరాభ్యాసము చేశాము. అనగా వ్రాత అక్షరములను నేర్చు కొన్నాము. తర్వాత ఉన్నత పాఠశాలకు (High School) పోయి అక్కడ కొంత విద్యను నేర్చాము. తర్వాత కళాశాలకు (College) పోయి విద్య నేర్వవలసియున్నది. ఆ తర్వాత విశ్వ విద్యాలయమునకు (University) పోయి విద్యను నేర్చువారు గలరు. మొదలు పెట్టినది ప్రాథమిక పాఠశాలలో సంపూర్ణ విద్యను నేర్చునది విశ్వ విద్యాలయములో. అన్నిటికంటే చిన్నది ప్రాథమిక పాఠశాల, అన్నిటికంటే పెద్దది విశ్వ విద్యాలయము. ఇప్పుడు మనము విశ్వ విద్యాలయమును గురించి చెప్పుకొందాము. మనుషు లందరూ విశ్వ విద్యాలయమునకు పోయి చదువలేరు. స్థోమతయున్న వారు మాత్రము విశ్వ విద్యాలయమునకు పోయి చదువగలరు. కొందరు ప్రాథమిక పాఠశాల వరకే చదువుకోగలరు. కొందరు ఉన్నత పాఠశాల వరకు పోయి చదువగలవారుందురు. ఇంకా ఆర్థిక స్థోమత, చదువగల ఓపిక, శ్రద్ధయున్నవారు కళాశాల వరకు పోయి చదువగలరు. చివరకు సంపూర్ణ విద్య నేర్వాలనుకొన్నవారు మాత్రము చివరిదైన విశ్వ విద్యాలయము నకు పోయి విద్యను నేర్వగలరు.

ఒక ప్రాథమిక పాఠశాలకు వందమంది విద్యార్థులు రాగా ఐదు సంవత్సరముల తర్వాత అందులో 75 మంది మాత్రము ఉన్నత పాఠశాలకు పోయి చదువగల వారుందురు. ఉన్నత పాఠశాలలో ఐదు సంవత్సరములు చదివిన తర్వాత వారిలో కొందరు అంతటితో ఆగిపోగా మిగతా 50 మంది దాకా కళాశాలకు పోయి చదువువారుందురు. అక్కడ కొంత కాలము చదివిన తర్వాత ఆ యాభైమందిలో కొందరు ఆగిపోగా, తర్వాత ఇరవై లేక ఇరవై ఐదు (20 లేక 25) మంది విశ్వవిద్యాలయమునకు పోయి

చదువువారుండవచ్చును. 25 మంది విద్యార్థులు విశ్వ విద్యాలయమునకు పోయి చదివినా, అందులో ఒక ఐదుమంది మాత్రము ప్రతిభగల విద్యార్థులు కాగా, మిగతావారు అంతంత మాత్రము చదువుగల వారే అయివుందురు. 25 మంది విశ్వ విద్యాలయములో చదువగా అందులో ఐదుమంది విద్యను బాగా నేర్చిన ప్రతిభగల వారుకాగా, ఐదుమంది పూర్తి విద్యరాని మొద్దు విద్యార్థులుగా ఉండగా మిగతా పదిహేను మంది మధ్యరకము విద్యార్థులుగా ఉన్నారు. విశ్వ విద్యాలయములో చేరిన వారందరికీ మంచి మార్కులు వస్తాయను నమ్మకము లేదు. అయినా అందరూ విశ్వ విద్యాలయ విద్యార్థులనియే పిలువబడుదురు.

నేడు బయటి ప్రపంచములో ఉన్న విద్యా వ్యవస్థను గురించి చెప్పుకొంటే ఇలాగున్నదని చెప్పక తప్పదు. అయితే విద్యలను గురించి చెప్పితే విద్యలు రెండు రకములుగా గలవు. ప్రాథమిక పాఠశాలనుండి ఉన్నత పాఠశాల, కళాశాల, విశ్వ విద్యాలయములలో ఒక రకమైన విద్యను బోధించుచున్నారు. విద్యలు ఒకటి ప్రపంచ సంబంధ విద్యకాగా, రెండు దైవికమైన విద్యయని చెప్పవచ్చును. వీటినే ప్రకృతి విద్య, పరమాత్మ విద్యయని కూడా అనుచుందుము. ప్రపంచ విద్య లేక ప్రకృతి విద్య అనబడు దానినే నేడు ప్రాథమిక పాఠశాలనుండి విశ్వ విద్యాలయముల (University) వరకు నేర్పించుచున్నారు. ఈ విద్యాలయములలో బోధించు బోధలన్నీ ప్రపంచ విద్యను నేర్పగా, ఆ ప్రపంచ విద్య మనిషియొక్క విజ్ఞానమును పెంచి ప్రపంచములో బ్రతికే దానికి దారిని చూపుచున్నది. ప్రపంచ సంబంధముగా నేర్చు ఎన్ని విద్యలయినా అవన్నియూ కేవలము మనిషి బ్రతుకుతెరువుకు మాత్రమే ఉపయోగపడుచున్నవి. అందువలన 'కూటి కొరకు కోటి విద్యలు' అని కొందరన్నారు.

కూటికొరకు కోటి విద్యలు అనినవారే మరొక మాటగా **"ముక్తి కొరకు మూడు విద్యలు"** అన్నారు. 'కూటికొరకు కోటి విద్యలు' అనుమాటను చాలామంది వినియుందురుగానీ, 'ముక్తికొరకు మూడు విద్యలు' అనుమాటను బహుశా ఎవరూ వినియుండరని అనుకుంటాను. మనము ఇంతకుముందు చెప్పుకొన్న రెండు విద్యలలో రెండవదయిన పరమాత్మ విద్యను ఉద్దేశించి చెప్పినమాటగా 'ముక్తి కొరకు మూడు విద్యలని' చెప్పబడినది. మనకు తెలిసిన ప్రపంచ సంబంధమైన విద్యలో ఎన్నో తెగలు గలవు. ప్రాథమిక విద్యలో అక్షరాభ్యాసము మొదలు చదవను, వ్రాయను నేర్పగా, ఉన్నత పాఠశాలలో భాషలు, వాటి వివరమును, తెలుపుచూ సామాన్య, సాంఘిక విద్యలను ప్రారంభింతురు. తర్వాత కళాశాలలో గణిత, రసాయనిక, ఖగోళ, భౌతిక శాస్త్రములను గురించి వాటి విభాగములను గురించి తెలుపుదురు. ఈ విధముగా పోనుపోనూ విద్యలు పెరుగుచూ, చీలుచూ పోయి ఇంజనీర్‌లలో అనేక తెగలు ఏర్పడగా, డాక్టర్లలో అనేక రకములు, సైన్సులో అనేక భాగములు, ఎన్నో విద్యలు ఎన్నో చీలికలుగా మారిపోవుచున్నవి. ఇవన్నియూ మనిషి బ్రతుకుతెరువుకు పనికి వచ్చేవేయని చెప్పవచ్చును. అందువలన కొందరు సూత్రప్రాయముగా 'కూటి కొరకు కోటి విద్యలు' అని చెప్పడము జరిగినది. మనిషి బ్రతికే దానికి అనేక విధములుగా ప్రవర్తించుచున్నాడని తెలియుటకు, కూటికొరకు కోటి విద్యలని అన్నట్లు కొందరు చెప్పుచున్నారు. వారు ఎలా అర్థము చెప్పినా నేడు ప్రపంచములో జరుగుచున్నది అదేనని చెప్పవచ్చును. ప్రతి మనిషి తాను నేర్చిన విద్యతో బ్రతుకగల్గుచున్నాడు.

**ప్రశ్న :- ప్రతి మనిషిని సృష్టించిన వాడు దేవుడేనని చెప్పారు. అలాగే ప్రతి మనిషిని పోషించేవాడు దేవుడేయని చెప్పారు. ఇప్పుడేమో ఎవడు**

**నేర్చిన విద్యతో వాడు బ్రతుకుచున్నాడని అంటున్నారు. దేవుడు పోషించు చున్నాడా? లేక స్వయముగా మనిషే బ్రతుకుచున్నాడా? అను ప్రశ్నలు మాలో వచ్చినవి. మీరు రెండు రకములుగా చెప్పి మమ్ములను తికమక పెట్టుచున్నారు. అట్లు కాకుండా ఏది వాస్తవమో, ఏది జ్ఞానమో దానినే చెప్పండి?**

**జవాబు :-** ఒకచోట భగవద్గీతలో కర్మయోగమందు మొదటనే కర్మ, బ్రహ్మ యోగములను గురించి అర్జునుడు ఇలాగే అడిగి ఏదో ఒకటి చెప్పమన్నాడు. ఇప్పుడు నీవు కూడా అలాగే అడిగావు. ప్రపంచములో భావమునుబట్టి రెండు రకములు గలవు. మనిషిలోని భావమునుబట్టి వాడే స్వయముగా బ్రతికినట్లు లెక్కించబడుచున్నది. అట్లే వాని భావమును బట్టి దేవుడే వానిని పోషించునట్లు లెక్కించబడుచున్నది. ఆధ్యాత్మిక విద్యలో మనిషి భావమును బట్టి చెప్పవలసియుండును. దేవుడు అందరినీ పోషించుట వాస్తవమే అయినా 'కర్మసిద్ధాంతము' ప్రకారము మనిషి భావమును బట్టి రెండు రకములుగా చెప్పవలసివచ్చును. ఏమాత్రము జ్ఞానము తెలియనివాడు తన అజ్ఞానము చేత అన్నియూ తానే చేయుచున్నట్లు అనుకోవడము వలన వాస్తవముగా అన్నీ దేవుడే చేయుచున్నా, ఆ విషయమును లెక్కించక అక్కడ మనిషి చేసినట్లే లెక్కించి, అందులోని ఫలితమైన కర్మను వానికే అంటగట్టవలసి యుండును. ఆధ్యాత్మికములో ఇది దేవుడే నిర్ణయించిన పద్ధతి.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. 'కూటి కొరకు కోటి విద్యలు' అనుమాటను నేను కూడా చాలామార్లు విన్నాను. అయితే **"ముక్తి కొరకు మూడు విద్యలు"** అనుమాటను ఎవరూ అనగా నేను ఇంతవరకు

వినలేదు. ప్రస్తుతము ఇప్పుడు మాత్రమే మొదట ఈ మాటను వింటున్నాను. నాకే ఇది క్రొత్తమాటగా యున్నప్పుడు, ఈ మాట మీకు కూడా క్రొత్తగనే యుండునని అనుకొంటాను.

**ప్రశ్న :- ఈ మాట మాకు క్రొత్తదే, మేము ఎప్పుడూ, ఎక్కడా వినలేదు. ఈ మాట క్రొత్తది అనుమాట ఎప్పుడూ వినని మాకు సరిపోతుందిగానీ, మీకు సరిపోదు కదా! మీరే చెప్పుచున్నప్పుడు, మీకు క్రొత్త ఏమిటి? మీకు తెలియకుండా చెప్పలేదు కదా! మీకు తెలిసే చెప్పుచున్నారు కదా! అలాంటప్పుడు ఈ మాట మీకు ఎలా క్రొత్తదయినది?**

**జవాబు :-** ఇంతకుముందు ప్రశ్నలోనే ఒకమాట చెప్పాను. అన్నీ దేవుడే చేస్తున్నమాట వాస్తవమే, అయినా మనిషి తానే చేస్తున్నట్లు '**అహం భావము**'ను పొందుట చేత అతని భావమును అనుసరించి లెక్కించబడునని చెప్పాము. మనిషికి ఏమీ చేతకాదు, మనిషికి ఏ బలము లేనిదానివలన అతనికి ఏమీ చేతకాదని, ఏమీ చేయలేడని చెప్పాలి. శరీరములోని జీవుడు గ్రుడ్డివాడు, కుంటివాడు, మూగవాడు, చెవిటివాడు. అంతేకాక అన్ని విధముల అవిటి వాడు. వాడు ఏ చిన్న పనిని కూడా చేయలేడు, చేతకాదు. అయినా 'అన్నీ నేనే చేయుచున్నానను' అహంభావముతో చెప్పుచుండును. ఇక్కడ వాస్తవముగా అన్నీ దేవుడే చేయుచున్నా, మనిషి ఏమీ చేయకున్నా, మనిషి చేత, మనిషి అవయవముల ద్వారా జరుగు పనులను చూచి, మనిషి తానే స్వయముగా చేయుచున్నానని అనుకొంటున్నాడు. వాని భావమునుబట్టి వాడు చేసినట్లుగానే లెక్కించబడుచున్నది. ఇక్కడే కర్మయోగ రహస్యమంతా దాగియున్నది. ఇక్కడ కొద్దిమాత్రము జ్ఞప్తి కలిగి తాను చేయలేదు, చేయువాడు దేవుడే అని తెలిసియుంటే కర్మయోగిగా మనిషి మారిపోవును. కర్మ అంటని స్థితిలో ఉండును.

నేను కొన్ని వందల సంవత్సరముల నుండి, ఇప్పుడు కొన్ని పదుల సంవత్సరములనుండి ఇదే జ్ఞానము కల్గియుండుట వలన, అనగా అనేక జన్మల సంస్కార బలముచేత ఈ జన్మలో కూడా అదే జ్ఞాపకముండుట వలన ఉన్నది ఉన్నట్లు చెప్పితే, నా శరీరములోని నా నోటినుండి మాట్లాడిన మాటను, అలాగే నా బుద్ధినుండి బయటికి వచ్చిన మాటను నేను చెప్పినట్లు బయటికి కనిపించినా అది నా నుండి వచ్చిన క్రొత్తమాటే. నేను జీవుడుగా ఇప్పుడే మొదటిసారి వింటున్నాను. శరీరము మధ్యలో, పెద్ద నాడిలో, నివాసమున్న ఆత్మయే ఈ మాటను క్రొత్తగా బుద్ధికి అందివ్వగా, బుద్ధి నుండి మనస్సుకు చేరి అది నోటినుండి పలుకబడినది. ఈ మాటను అందరికంటే ముందు నా బుద్ధికి చేరినప్పుడే నేను వినగలిగినా, నేను కూడా మీకంటే కొద్ది ముందుగా వినినా, అంతకంటే ముందు ఆ మాట వాస్తవముగా నాకు తెలియదనియే చెప్పాలి. లోపలి చూపు లేనివారు, అంతర్ జ్ఞానము తెలియని వారు 'నేనే చెప్పాను' అనే భావమును పొందవచ్చును. అలాగే 'నేనే చేశాను' అనే భావమును పొందవచ్చును. కానీ నేను అలా అనుకొనుటకు అవకాశమే లేదు. అందువలన క్రొత్తగా వచ్చిన ఆ మాటను 'నేను మీవలె మొదటిగా విన్నాను' అని చెప్పాను. ఒకవేళ ఈ మాటకు వివరమును చెప్పవలెనన్నా, ఆ మాటే నాకు క్రొత్తదయి నప్పుడు వివరము నాకు తెలియదనేగా అర్థము. అయినా నా నుండే ఆ వివరము వచ్చినా ఆశ్చర్యపోనవసరము లేదు. చెప్పేవాడు కూడా హృది మధ్యలోనున్న వాడే చెప్పును.

**ప్రశ్న :- 'కూటికొరకు కోటి విద్యలు' అని ఇతరులు అనడము ఇంతకు ముందు కొన్నిమార్లు విన్నాము. బ్రతుకుతెరువు కొరకు అనేక పనులు చేసి మనిషి జీవించుట వలన ఆ విధముగా అన్నారని అర్థమయినది.**

వాస్తవముగా బయట ప్రపంచములో కూడా అట్లే జరుగుచున్నది. మనిషి బ్రతికే దానికి కొందరికి సులభమైన పనులున్నాయి. కొందరికి కష్టమైన పనులున్నాయి. కొందరికి గొప్పవని చెప్పు పనులుండగా, కొందరికి నీచమైనవని చెప్పబడు పనులున్నాయి. కొందరికి కొద్దిసేపు చేయు పనులుండగా, కొందరికి చాలాసేపు చేయు పనులున్నాయి. కొందరికి పోలీస్ పని యుండగా, కొందరికి దొంగతనము చేయు పనులున్నాయి. కొందరికి చెప్పే పనులుండగా, కొందరికి చేసే పనులున్నాయి. కొందరికి పూడ్చే పనులు ఉండగా, కొందరికి త్రవ్వే పనులున్నాయి. కొందరు డాక్టర్లుగా కత్తులతో ఆపరేషన్ చేసి మనుషులను బ్రతికించే పనులుండగా, కొందరు హంతకులుగా కత్తులతో చంపే పనిని చేయుచున్నారు. కొందరికి వ్రాసే పనియుండగా, కొందరికి చదివే పనియున్నది. కొందరికి అమ్మే పని యుండగా, కొందరికి కొనే పనిమాత్రమే యున్నది. ఇట్లు చెప్పుచూపోతే, వేలు, లక్షలునుండి దాదాపు కోటివరకు పనులుండుట వలన, అన్ని పనులు మనిషి జీవించే దానికే చేయబడుచుండుట వలన 'కూటి కొరకు కోటి విద్యలు' అని అనడములో అర్థమున్నది. 'ముక్తి కొరకు మూడు విద్యలు' అనడములో అర్థమేమి కలదు?

**జవాబు :-** **'కూటి కొరకు'** అని ఐదక్షరముల పదమును చెప్పినట్లు **'ముక్తి కొరకు'** అని ఐదక్షరముల పదమునే చెప్పారు. రెండు పదములలో ఐదు అక్షరములేయున్నా అర్థములు మాత్రము చాలా భిన్నముగా యుండును. కూటికొరకు అనగా బ్రతికే దానికొరకు లేక జీవించే దానికొరకు అని చెప్పవచ్చును. కోటి విద్యలు అనే దానికి అర్థము తెలుసు. అయితే మూడు విద్యలు అనేవి ఏవి? అని తెలియవలసియున్నది. బ్రతికే దానికి

అందరికీ ఆహారము అవసరము. ఆహారము కొరకు ఎన్నో పనులు చేయాలి. కొన్ని పనులు చేయుటకు ముందు ఆ పనులకు సంబంధించిన విద్యలు నేర్చియుండాలి. ప్రతి పని చేయుటకు ముందు దానిని గురించి తెలిసి యుండాలి. పనిని గురించి తెలియుదానిని లేక నేర్చు దానిని 'విద్య' అని అంటున్నాము. కోటి పనులకు కోటి విద్యలున్నాయని చెప్పవచ్చును. అయితే ఇక్కడ ముక్తిని సంపాదించుటకు లేక ముక్తిని పొందుటకు మూడు పనులున్నాయని తెలియుచున్నది. ఆ మూడు పనులకు మూడు విద్యలున్నట్లు చెప్పారు. ఈ విషయములో ముందు **'ముక్తి'** అను పదమునకు అర్థమును తెలుసుకొందాము.

**"ముక్తి"** అనగా 'బంధనము నుండి విడుదల పొందడము' అని సూటిగా చెప్పవచ్చును. **'బంధనము'** అనగా బంధింపబడి యుండడము. బంధనములను త్రెంచివేయడమును ముక్తి లేక విముక్తి అని అనవచ్చును. బంధనములను త్రెంచివేయడము ఒక పనికాగా ఆ పనిని కూడా నేర్వవలసిందే. నేర్వవలసినదేదయినా అది విద్యయే. మనిషికి తెలియ కుండానే బంధింపబడియున్నాడు. తాను పుట్టుకతోనే ఒక బంధీననీ, మూడు త్రాళ్ళచే బంధింపబడియున్నానని ఎవరికీ తెలియదు. ఎవరితో నయినా ఈ మాట అంటే నీకు ఏమయినా తిక్కా? అని వారు అడుగవచ్చును. ఎందుకనగా! ఏ మనిషికీ తాను బంధింపబడినట్లు తెలియదు. కనిపించని త్రాళ్ళచే, కనిపించక బంధీ అయివున్నానని ఎంతగొప్ప చదువులు చదివిన వారికి కూడా తెలియదు. బాహ్యనేత్రములకు తెలియని బంధనము, అంతర్ నేత్రమయిన జ్ఞాననేత్రమునకు తెలియును. జ్ఞాననేత్రము జ్ఞానమున్నవారికి మాత్రమే ఉండును. అనగా దైవ జ్ఞానమున్న వారికి మాత్రమే తెలియును.

మనిషి పుట్టుకతోనే సాత్త్వికము, రాజసము, తామసము అను మూడు త్రాళ్ళచే బంధింపబడియున్నాడు. మూడు త్రాళ్ళు మూడు గుణ సముదాయములచే పేడబడినవి. గుణములు దారము పోగులుగాయుండగా 108 పోగుల దారముచే ఒక్కొక్క త్రాడు పురిపెట్టబడి పేడబడియున్నవి. తామస, రాజస, సాత్త్విక అను మూడు పేర్లు గల గుణములను త్రాళ్ళను ఆధ్యాత్మిక పరిభాషలో "మాయ" అని అంటున్నాము. మాయ అను త్రాళ్ళు చాలా బలమైనవి, అందువలన భగవద్గీత విజ్ఞానయోగము 14వ శ్లోకమున ఇలా అన్నారు.

శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతితే ॥

భావము :- **"దైవము అయిన నేను తయారు చేసిన నా మాయ దుస్సాధ్య మైనది. నన్ను శరణుబొందు మనుషులు మాత్రము నా మాయను సులభముగా దాటిపోగలరు. నన్ను ఆరాధించని వారు నా మాయను దాటలేరు."** మనము బంధింపబడిన త్రాళ్ళు అను మాయనుండి బయట పడుట దుస్సాధ్యమయిన పనియగును. ఎందుకనగా! మాయ అనబడు ఆ మూడు త్రాళ్ళను దేవుడే బలముగా తయారు చేశాడు. **ఎవడయితే దేవుని శరణు బొందునో వాడు మాయను దాటి పోగలడు.** తామస, రాజస, సాత్త్విక అను మూడు గుణముల చేత తయారయిన మాయను జయించవలెనంటే మాయను తయారు చేసిన దేవున్ని శరణు బొంది, ఆయనను ఆరాధించినప్పుడు మాయ మనిషిని తన బంధములనుండి విడుదల చేయును. మాయ తనంతట తాను విడువనంతవరకు ఎవడూ మాయ నుండి విడిపించుకోలేడు. మాయ మనిషిని విడువాలంటే మాయకు దేవుని ఆజ్ఞ కావాలి. దేవుని ఆజ్ఞ లేనిది మాయ ఎవడినీ వదలదు. దేవుని భక్తుడయిన వాడే దేవునికి ఇష్టుడగును.

దేవునికి ఎవడు ఇష్టుడో వానిని మాయ వదలి దేవుని వద్దకు పంపును. దేవునికి ఎవడు అయిష్టుడో వానిని మాయ వదలదు. వాడు దేవుని వద్దకు పోలేడు.

ప్రతి మనిషి దైవజ్ఞానము తెలిసి దేవున్ని ఆరాధించినప్పుడు, తనకు తెలియకుండాయున్న బంధనములు దానంతటవే తెగిపోవును. మనకు తెలియకుండా మన తలలో కట్టబడియున్న మనము మనకు తెలియకుండానే విడుదల పొందగలము. **'విడుదలను పొందడమే ముక్తి'** అని అంటున్నాము. మనిషిని కట్టియున్న త్రాళ్ళు తయారయినది గుణముల దారములతో అని చెప్పాము కదా! గుణముల పోగులను బట్టి మూడు త్రాళ్ళకు మూడు పేర్లు గలవు. మూడు తాడులు మాయ అను కనిపించని గుణముల చేత తయారయినా, కర్మయను నల్లని రంగు కలిగిన త్రాళ్ళుగా ఉన్నాయి. పై రంగునుబట్టి 'కర్మబంధములు' అని అనవచ్చును. లోపలి త్రాడులోని దారములను బట్టి 'మాయ బంధనము' అని అనవచ్చును. గుణముల చేతనే కర్మ ఏర్పడుట వలన పైకి కర్మ రంగు త్రాళ్ళుగా కనిపించుచున్నవి. మాయ అను తంతువుల చేత పేర్చబడి, కర్మయను నల్లని రంగుగల బంధనములు అనగా త్రాళ్ళు మనిషిని కనిపించక బంధించియున్నవి. కనిపించక కట్టబడియున్న కర్మ అను నల్లని బంధములను లేక మాయ అను మూడు బంధనములను లేకుండా చేసుకొనుటకు కొంత పనిని చేయవలసి యున్నది. ఆ పనిని మూడు యోగములుగా చెప్పవచ్చును. మూడు బంధనములను త్రెంచుకొనుటకు యోగములను మూడు పనులు చేయ వలసియుండగా, ఆ మూడు పనులను ఎలా చేయాలో తెలియుటకు విద్య అవసరము. ఆ విద్యనే 'బ్రహ్మవిద్య' అని అంటారు. ప్రపంచ విద్యలు శాస్త్రములుగా యున్నట్లు బ్రహ్మవిద్య కూడా శాస్త్రముగా

ఉండుట వలన దీనిని 'బ్రహ్మవిద్యా శాస్త్రము' అని అంటారు. బ్రహ్మవిద్యా శాస్త్రమును నేర్వగలిగితే కర్మబంధముల నుండి, మాయ ఆధీనమునుండి బయట పడవచ్చును.

ప్రశ్న :- **భూమిమీద పనులు వేలు, లక్షలు మొదలుకొని 'కోటి' అను పెద్ద సంఖ్య వరకు యుండవచ్చునని తెలుసుకొన్నాము. కోటి పనులు చేయుటకు కోటి విద్యలు అవసరము అని 'కూటికొరకు కోటి విద్యలను' మాటను అన్నాము. అయితే అవన్నియూ ప్రపంచ సంబంధమైన విద్యలని కూడా విన్నాము. అన్ని విద్యలను ఎక్కడ నేర్పుతారో చెప్పండి?**

**జవాబు :-** ఇక్కడ మనము కొంత తప్పును సరిదిద్దుకొని చెప్పుకోవలసిన అవసరమున్నది. అదేమనగా! మనిషి కూటికొరకు కోటి పనులు చేయుచున్నాడు. అందువలన 'కూటికొరకు కోటి పనులని' అనాలిగానీ, 'కూటి కొరకు కోటి విద్యలు' అని అనకూడదు. అలా అనడము అలవాటై పోయినది. భూమిమీద పనులు ఎన్నియైనా ఉండవచ్చునుగానీ విద్యలు 64 మాత్రమే గలవు. వాటినే సంస్కృత భాషలో **చతుష్షష్ఠీ విద్యలు** అని అన్నారు. అంతేగానీ ఎక్కడా కోటి విద్యలు లేనే లేవు. ఒక విద్య ఎన్నో పనులను నేర్పించునదైయుండును. ఒక విద్యతో ఎన్నో కార్యములను సాధించవచ్చును. అందువలన కోటి కార్యములకయినా 64 విద్యలే సరిపోవును.

ప్రశ్న :- **మీరు విశ్వ విద్యాలయము అనగా అన్ని శాస్త్రములను బోధించునది యని చెప్పారు. దానిలో ఎన్ని శాస్త్రములు బోధిస్తారు?**

**జవాబు :-** కూటి కొరకు కోటి విద్యలని ఎట్లు అలవాటైన తప్పును మాట్లాడుచున్నామో! అట్లే శాస్త్రములను బోధించునది విశ్వ విద్యాలయము

అని అంటున్నారు. దేశములో ఎన్నో విశ్వ విద్యాలయములు గలవు. వాటిలో కొన్నింటియందు నాలుగు శాస్త్రములను, కొన్నింటియందు ఐదు శాస్త్రములను బోధించుచున్నారు. అవి అన్నియూ ప్రపంచమునకు సంబంధించిన శాస్త్రములే అయివున్నవి. ప్రపంచ శాస్త్రములకు సంబంధించిన బోధలను చెప్పు వాటిని విద్యాలయములు లేక శాస్త్ర విద్యాలయములు అని అనవచ్చును. అవి ఎప్పటికీ విశ్వ విద్యాలయములు కాజాలవు. శాస్త్రములను బోధించునవయినందున శాస్త్ర విద్యాలయములు అనడములో తప్పులేదు. వాటికి విశ్వ విద్యాయములను పేరు వర్తించదు, దాని అర్థము సరిపోదు.

**ప్రశ్న :- విశ్వ విద్యాలయము అనగా అర్థమేమి కలదు?**

**జవాబు :-** 'విద్యాలయము' అనగా విద్య లభించు మందిరము అని అర్థము. విశ్వ విద్యాలయము అనగా విశ్వమునకు సంబంధించిన విద్య లభించు ఆలయము అని అర్థము. విశ్వము అనగా ప్రపంచము అని చెప్పు కోకూడదు. ప్రపంచమంతా ఏక రూపములోయున్న దానిని 'విశ్వము' అని అంటున్నాము. విశ్వరూపము అనగా ప్రపంచమంతాయున్న రూపమని అర్థము. ప్రపంచమంతా ఏకరూపములో యున్నవాడు దేవుడే. అందువలన ఆయనను 'విశ్వరూపుడు' అని అన్నాము. విశ్వము అంతా ఏకరూపమున యున్నవాడు కనిపించడు. అందువలన కనిపించని దేవున్ని ఒక్కడినే విశ్వ రూపుడని అంటున్నారు. విశ్వమంతా అణువణువునా వ్యాపించి ఎవరికీ కనిపించని వాడు దేవుడని అర్థము. దేవున్ని గురించి, ఆయన ఆకారమును గురించి భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగము అని కలదు. విశ్వ రూపుడైన దైవమును గురించి తెల్పు విద్య ఎక్కడ చెప్పబడుచున్నదో అక్కడే విశ్వ విద్యాలయము కలదని చెప్పవచ్చును. విశ్వ విద్యాలయము అనగా

పెద్ద భవనముల సముదాయముతో కూడుకొని యుండునని అనుకోకూడదు. విశ్వ విద్య ఎక్కడ ఉండినా అక్కడ విశ్వ విద్యాలయము ఉన్నట్లేయగును. పూరిగుడిసెలో విశ్వరూపుడైన దేవున్ని గురించి చెప్పుచున్నప్పుడు ఆ చిన్న గుడిసెనే విశ్వ విద్యాలయముగా తలచవలెను. దేవుడు విశ్వరూపుడై యుండును. విశ్వములోని ప్రతి వస్తువుగా, ప్రతి రూపముగా అన్నిటియందు, అంతటా దేవుడుండుట వలన ఆయనను **సర్వవ్యాపి** అనియూ, **సర్వధారి** అనియూ చెప్పుచున్నారు.

విశ్వ విద్యాలయములో దేవుడు లేక పరమాత్మను గురించి బోధించు బోధను బ్రహ్మవిద్య అని అందురు. బ్రహ్మవిద్య అనగా పెద్ద విద్య అని అర్థము. బ్రహ్మవిద్య శాస్త్రబద్ధతతో కూడుకొనియుండుట వలన, బ్రహ్మ విద్యను శాస్త్రముతో జోడించి బ్రహ్మవిద్యా శాస్త్రము అని అంటారు. బ్రహ్మవిద్యా శాస్త్రము మిగతా ఐదు శాస్త్రములకంటే గొప్పది. బ్రహ్మ విద్యా శాస్త్రముతో ప్రపంచములో ఏ విద్యాశాస్త్రము కూడా సరితూగదు. అందువలన అన్నిటికంటే పెద్దది బ్రహ్మవిద్యా శాస్త్రమని చెప్పుచున్నాము. మిగతా శాస్త్రములు ఐదు బ్రహ్మవిద్యతో సమానము కావు. మిగతా ఐదు శాస్త్రములు భౌతికమునకు సంబంధించినవికాగా, బ్రహ్మవిద్యా శాస్త్రము అభౌతికమయినది. భౌతికమయిన విద్యలు కనిపించుచుండును. అందువలన ఎవరయినా వాటిని నేర్వవచ్చును. అభౌతికమయిన బ్రహ్మ విద్యను నేర్వవలయునంటే ముఖ్యముగా విశ్వాసము ఎక్కువగా ఉండవలెను.

**ప్రశ్న :- ఆధ్యాత్మిక విద్యయే బ్రహ్మవిద్య అని మేము అనుకొంటున్నాము నిజమేనా?**

**జవాబు :-** బ్రహ్మవిద్య అనగా పెద్ద విద్యయని చెప్పుకొన్నాము.

ప్రపంచములో ఎవడయితే పెద్దగాయున్నాడో వానిని గురించి చెప్పుకొను విద్యయే బ్రహ్మవిద్య అని అనుచున్నాము. దేవున్ని గురించిన విద్యను బ్రహ్మవిద్య అనీ, దేవున్ని గురించి తెలియజేయు శాస్త్రమును బ్రహ్మవిద్యా శాస్త్రము అనీ అనడము జరుగుచున్నది. ఇక్కడ మీ ప్రశ్న ఆధ్యాత్మిక విద్యయే బ్రహ్మవిద్యనా? అని అడిగారు. నిజము చెప్పాలా! అబద్ధము చెప్పాలా!! అని నేను సంశయించుచున్నాను. ఎందుకనగా! మేము ఇంత వరకు అబద్ధము చెప్పినా అది నిజమే. అంటే నేను నిజముగా యున్న అబద్ధమును చెప్పానని ఒకరకముగా చెప్పవచ్చును. నేను చెప్పిన అబద్ధమే నిజమని కూడా చెప్పవచ్చును. ఈ నా మాటలు మిమ్ములను కొంత అనిశ్చితకు గురిచేయును. మీకు నిజము తెలియాలంటే ముందు అనిశ్చితకు గురికావడమే మంచిదని నేను అనుకొంటున్నాను. ఇప్పుడు చెప్పబోవు విషయములను జాగ్రత్తగా వినండి...

దేవుడు తన విషయము ఏ మానవునికీ తెలియదని దైవ గ్రంథములలో చెప్పాడు. **దేవుని విషయము దేవునికి తప్ప భూమిమీద ఏ మనిషికీ తెలియదు.** దేవుడు ఎవరితోనూ మాట్లాడువాడు కాడు. ఆయన నామ, రూప, క్రియలు లేనివాడు. అటువంటి వాడు ఎవనికీ కనపడడము జరుగదు. ఎవడూ ఆయనను గురించి చెప్పుటకు అర్హుడు కాడు. ఆయన ఎవరి ఊహకు అందనివాడు. దేవుడు అనగా తెలియబడువాడు కాదని అర్థము. దేవుడు ఏ నియమ నిబద్ధత లేనివాడు. ఏ శాస్త్రము ఆయనను శాసించి చెప్పలేదు. ఆయనను గురించి ఇట్లు అట్లు అని చెప్పుటకు వీలులేదు. అటువంటి వానిని గురించి శాస్త్రములు చెప్పగలవా? ఊహించి చెప్పనగునా? దేని వలన చేతకాదు అని చెప్పడమే మంచిది. అయితే ఇంతవరకు అనేక చోట్ల, అనేక సందర్భములలో దేవున్ని గురించి చెప్పాము.

బ్రహ్మవిద్య వలన దేవుడు తెలియబడునని, ప్రపంచములో దేవుడే పెద్దయని, దేవుడు సృష్టికర్తయని, దేవుడు అందరికీ తండ్రియనీ అనేక విధముల అనేక చోట్ల దేవున్ని గురించి చెప్పాము. అలా చెప్పడము అంతా సత్యము కాదు. అలా దేవున్ని గురించి చెప్పగలిగితే ఆయన మన ఊహకుగానీ, మన జ్ఞానమునకుగానీ అందినవాడగును. వాస్తవముగా దేవుడు ఏ జ్ఞానమునకు గానీ, ఎవరి ఊహకుగానీ అందేవాడు కాడు. ఎవరూ ఆయనను దేనితోనూ పోల్చి చెప్పలేరు.

ఈ నా మాటలు వినిన ఎవరికయినా మతిచెడినంత పని కాగలదు. ఇంతవరకు దేవుని జ్ఞానమును ప్రపంచములో అందరికంటే బాగా బోధించిన ఈయనే ఎందుకు ఇలా మాట్లాడుచున్నాడని అనిపించును. నేను ఏదో పైత్యముతో అలా మాట్లాడలేదు. ఒక విధముగా అందరికీ అసత్యముగా కనిపించినా సత్యమునే చెప్పుచున్నాను. ఇంతకుముందు చెప్పినది సత్యము కాదని నేను చెప్పినా అది కూడా నిజమేనని చెప్పుచున్నాను. రెండు నిజములు ఎలాగుండును. ఏదో ఒకటి సత్యము, మరొకటి అసత్యముగా యుండును కదా! అని అడిగితే నా మాటను బాగా వినగలిగి, బాగా యోచించగలిగితేనే మీకు అర్థము కాగలదని చెప్పుచున్నాను. ఎక్కడ ఏమి చెప్పినా అది దేవుని విషయమనే చెప్పాలి. జ్ఞానము వలన తెలియబడు వాడు దేవుడేయని చెప్పాలి. జ్ఞానము వలన దేవుడు తెలియబడడు, అయినా అలాగే చెప్పాలి. అందరికీ తండ్రి దేవుడు అని చెప్పినా అప్పుడామాట వినాలి. వాస్తవముగా **'దేవునికి సంతతి లేదు, దేవుడు ఎవరి సంతతి కాదు'** అను దైవగ్రంథములోని వాక్యము ప్రకారము దేవుడు అందరికీ తండ్రి అనుమాట అసత్యమేయగును. అసత్యమని తెలిసినా నేను అందరికీ తండ్రి దేవుడేయని చెప్పాను. అలా చెప్పడమునకు కారణము ఏమనగా!

గతములో కూడా నేను సందర్భానుసారము ఒకమాటను చెప్పాను. 'దేవుడు ఏదీకానివాడు అయినా మనము దేవున్నే చెప్పుచున్నాము' అని చెప్పాను. దేవుడు మనము చెప్పే విషయమునకు సంబంధము లేకున్నా ఆయన గౌరవార్థము ఆయననే చెప్పాలియని చెప్పాము. దంపతులకు సంతతి ఇచ్చువాడు దేవుడు అని చెప్పేది అసత్యమైన మాటే. ఆయన ఏ పనినీ చేయనివాడుగా యున్నాడు అనుటయే సత్యము. అయినా అసత్యమును చెప్పుచున్నాము. దేవుని గౌరవార్థము అన్నిటికీ ఆయనే కారణము, అన్నిటికీ ఆయనే పెద్ద, అన్నిటినీ ఆయనే చేస్తున్నాడు అని అంటున్నాము. అలా అనడములో తప్పులేదు. దేవున్ని అలాగే గౌరవించి చెప్పాలి. అయితే వాస్తవముగా ఆయనకు ఏమి సంబంధము లేదని తెలిసి యుండాలి. అజ్ఞాన ప్రజలకు దేవున్ని అలా చెప్పితేనే వారు దేవున్ని గౌరవింతురు. గౌరవ భావము కల్గియుందురు. నేను చెప్పు బోధలో దేవున్ని గొప్పగా చెప్పుచుందును. అందరినీ ఆడించువాడు దేవుడేయని చెప్పుచుందును. అలా చెప్పడము నా బాధ్యత. అయితే దేవుడు అలా లేడు అని నాకు తెలిసి పైకి అలా చెప్పుచున్నాను. నా లోపల దేవుని ఎడల ఒక భావముండగా, బయట వేరొక భావమును చెప్పుచుందును. తప్పనిసరిగా అలాగే చెప్పాలి. వినేవారు పూర్తిగా సంపూర్ణ జ్ఞానులైతే అప్పుడు అలా చెప్పనవసరము లేదు. అప్పుడు నాలో యున్న భావమును ఉన్నదున్నట్లు చెప్పవచ్చును. మీరు కొంత జ్ఞానము కలిగి ఆధ్యాత్మిక విద్యనే బ్రహ్మవిద్య అని అనుకొంటున్నాము అని అడిగారు కావున ఇప్పుడు మీకు సత్యమునే చెప్పవలసి వచ్చినది.

**ప్రశ్న :- దేవుడు మనలను రక్షించును అని మీరు అన్నారనుకోండి, అప్పుడు నిజము చెప్పినట్లా, అబద్ధము చెప్పినట్లా? 'దేవుడు కరుణామయుడు, దయా శీలుడు' అని గ్రంథములోనే వ్రాశారు కదా!**

**జవాబు :-** దేవునికి ప్రాథమిక ధర్మములున్నవి. ఆ ధర్మముల ప్రకారమే ఉండును. వాటిని అతిక్రమించి ఏమీ చేయువాడు కాదు. గ్రంథములో వ్రాసియుండుట వాస్తవమే, అంతమాత్రమున మనము అక్కడ వ్రాసిన దానిని సరిగా అర్థము చేసుకొన్నామని ఎందుకు అనుకోవాలి? గ్రంథములో వ్రాసిన దానిని సరిగా అర్థము చేసుకోకపోవడము వలన మనము తప్పు దారి పట్టియున్నాము. దేవుడు తన ప్రాథమిక ధర్మము ప్రకారము క్రియా రహితునిగాయున్నాడు. అందువలన ఆయన ఏమీ చేయువాడు కాడు. **"ఆయన ఎవరినీ రక్షించడు. ఆయనకు దయ లేదు. కరుణ అంతకూ లేదు".** గ్రంథములో దయామయుడు అని వుంది కదా! యని మీరు అడుగవచ్చును. దానికి నా జవాబు ఇలా కలదు. దైవ గ్రంథములో కూడా ఆ మాట చెప్పియున్నారు. 'దేవుడు దయాశీలుడు' అని అన్నప్పుడు, ఆయన 'ఆపదనుండి రక్షించును' అని అన్నప్పుడు ఆ మాటలు దేవుని ప్రాథమిక హక్కును దెబ్బతీయుచున్నాయి. గౌరవార్థముగా అలా చెప్పినా ఫరవాలేదుగానీ, అదే సత్యమని చెప్పితే చెప్పినవాడు దైవ ధర్మమునకు వ్యతిరేఖియగును. దైవగ్రంథమునకు విలువ నిచ్చువారు అందులోని సత్యమును తెలియవలెనుగానీ, పొరపాటు పడకూడదు. దేవుడు అను మాటను విన్నప్పుడు ఆయనను ఒక్కనిగా తలచకూడదు. దేవుడు ముగ్గురితో కలిసియున్నవాడని జ్ఞాపకము చేసుకోవలెను. దేవుడు మూడు భాగములుగా యున్నాడని తెలియగలిగినప్పుడు వాడు జ్ఞాని అయినట్లేనని చెప్పవచ్చును.

భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున 16, 17 శ్లోకములలో చెప్పిన ప్రకారము 'దేవుడు ఏకస్వరూపుడు కాడు. ఆయన ఇంకొక ఇద్దరితో కలిసియున్నాడు.' ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. 'దేవుడు దయామయుడు' అనుమాట ఆ ముగ్గురిలో దేవునిగా యున్నవానికా? అంటే దేవుని ధర్మముల ప్రకారమైతే దేవునికి ఆ మాట వర్తించదు అని చెప్పవచ్చును.

ఆ ముగ్గురిలో ఇంకా ఇద్దరి గురించి చూస్తే ఒకరు జీవాత్మకాగా, ఇంకొకరు ఆత్మగాయున్నాడు. దేవుడు ధర్మము ప్రకారము ఏదీ కానివాడు, ఏదీ చేయని వాడు. రెండవ వాడయిన ఆత్మ దేవుని తర్వాత యున్నవాడు కాగా, ఆత్మ తర్వాత యున్నవాడు జీవాత్మ. మొదటివాడు దేవుడుకాగా, రెండవ వాడు ఆత్మ కాగా, మూడవ వాడు జీవాత్మగా యున్నాడు. దేవుడు తన ధర్మము ప్రకారము ఏమీ చేయడు. జీవుడు తన ధర్మము ప్రకారము ఏమీ చేతకాని వాడు. దేవుడు చేతనయినా తన ధర్మమును అనుసరించి ఏమీ చేయడు. జీవుడు తన ధర్మము ప్రకారము ఏమీ చేయలేని వాడు. ఈ లెక్క ప్రకారము దేవునిలోని రెండు భాగములు అనగా దేవుడు, జీవుడు ఇరువురు ఏమీ చేయకుండా ఊరక ఉండువారుగా యున్నారు. అయితే 'దేవుడు రక్షించును' అని దైవగ్రంథములోని మాట వృథా కాకుండా 'రక్షించు వాడు మరియు శిక్షించువాడు'గా ఆత్మ ఒక్కడు గలడు. ఆత్మయే అన్ని పనులు చేయుచున్నది. దేవుని ఎడల చెప్పిన మాటలన్నిటినీ ఆత్మ నెరవేర్చుచున్నది.

దేవుడు మానవులకు తండ్రి అనినా, ఆ మాటకు దేవుడు తండ్రి కాడుగానీ, దేవునిలో భాగమైయున్న ఆత్మ తండ్రిగాయున్నాడని చెప్పవచ్చును. ప్రపంచములో ఆత్మ చేయని పనంటూ ఏదీ లేదూ. ఆత్మ ఎల్లవేళలా పని చేయుచున్నది. ఆత్మ సర్వకార్యములను చేయుచున్నదని నాకు తెలిసినా, నేను ఇతరులకు జ్ఞానమును చెప్పునప్పుడు ఆత్మ చేయు పనులను దేవుడే చేయుచున్నాడని దేవుని గౌరవార్థము చెప్పుచున్నాము. ఈ విధముగా చెప్పుచూ గ్రంథములలో కూడా ఆత్మ చేయు పనులను చెప్పక వాటినే దేవుడు చేయుచున్నాడని చెప్పాను. అలా ఎందుకు చెప్పాలి? అన్నీ ఆత్మే చేయుచున్నదని ఎందుకు చెప్పకూడదు? అని ఎవరయినా అడిగితే దానికి ఈ విధముగా సమాధానము చెప్పాలి.

ఆత్మ అణిగి యున్నవాడు. ఎక్కడా బయటికి ప్రాక్కకూడదు. ఆత్మ బయటికి తెలియకుండా ఉండవలెను. బయటికి తెలియువారు జీవుడు, దేవుడు ఇద్దరు మాత్రమే. దేవుడు ఏ పనినీ చేయడు. అట్లే జీవుడు ఏ కార్యమును చేయుటకు అనర్హుడు. దేవుడు చేతనయినా చేయడు. జీవుడు చేతకానివాడైయుండి ఏ కార్యము చేయడు. అయితే మనము మనకు తెలిసిన జ్ఞానము ప్రకారము దేవుని గౌరవార్థము దేవుడు చేయుచున్నాడని అంటున్నాము. అట్లే మనకు తెలియని జ్ఞానము ప్రకారము, తెలిసిన అజ్ఞానము ప్రకారము చేయని జీవున్ని పనులు చేశాడని చెప్పుచున్నాము. జీవుడు, దేవుడు ఇద్దరు ఏమీ చేయరు. అయితే వారిరువురు కార్యములను చేసినట్లే చెప్పబడుచున్నారు. అసలు సూత్రధారి, అన్ని కార్యములు చేయువాడు ఆత్మయుండగా ఆత్మను ఎవరూ అనుకోను కూడా అనుకోరు. ఆయన ఉన్నా లేనట్లే! ఎవరికీ తెలియనివాడుగా యున్నాడు. అందువలన ఆత్మ శరీరములో అణిగియుండి ఎవరికీ తెలియకుండా తన కార్యమును తాను చేయుచున్నది. దేవుడు చేయుచున్నాడు అని ఎక్కడయితే చెప్పామో అక్కడ ఎవరికీ తెలియకుండా చేయువాడు ఆత్మయే. అయితే ఆత్మ చేయు పనులన్నిటినీ జీవుడు అజ్ఞానము చేత నేనే చేస్తున్నానని అంటున్నాడు. అట్లే ఆత్మ చేయు కార్యముల అన్నిటినీ జ్ఞానము చేత జ్ఞానులందరూ దేవుడే చేయుచున్నాడని చెప్పుచున్నారు.

ఆత్మ చేయు పనులను దేవుడు చేశాడు అని చెప్పడము దేవున్ని గౌరవించు నిమిత్తమే అని చెప్పాము. అలా చెప్పడము జ్ఞానమే అగును అజ్ఞానము కాదు. ఇంట్లో కొడుకు పెత్తనము చేయుచున్నా పెత్తనమంతా మా తండ్రిదేయని చెప్పడము మంచిదే కదా! అట్లే ఆత్మ కార్యములను చేయుచున్నా పరమాత్మయని చెప్పడము దేవున్ని గౌరవించినట్లే కదా! ఆత్మ

పనులు చేయుచున్నా, జీవుడు నేను చేశానని చెప్పుకోవడము జీవునిది పూర్తి అజ్ఞానమగును. ఆత్మే కార్యములను చేయుచున్నదని జీవునికి తెలియక పోయినా, దేవుడే అన్నీ చేస్తున్నాడని అనుకొనినా తప్పులేదు. దానివలన పాపపుణ్యములు రావు. అట్లు కాకుండా తాను చేయకున్నా జరిగెడి పనులకు తానే కారణమనుకొని, ఈ కార్యములను నేనే చేశాను అని జీవుడు చెప్పడము వలన వానికి పాపపుణ్యములను కర్మలు అంటు చున్నవి. వాస్తవముగా జీవునికీ, జరిగిన పనులకూ సంబంధములేదు. పనులన్నిటినీ ఆత్మే చేయుచున్నది. ఆత్మ చేయుపనులన్నీ శరీరము ద్వారా జరుగుచుండుట వలన శరీరములో ఆత్మ అణిగి ఉన్నాడని తెలియక, ఆత్మ విషయమే అర్థముకానివాడై, శరీరములో యున్నది నేను మాత్రమేనని, దేవున్ని కూడా మరచిపోయినవాడై, జరిగిన పనులన్నీ నేనే చేశానని జీవుడు అనుకోవడము వలన చేయని కర్మ ఫలితము అనగా కర్మ (పాప పుణ్యములు) జీవునికి అంటుకొనుచున్నవి. ఈ విధముగా జీవుడు అనవసరముగా అనుకొని, అనవసరముగా కర్మలను తలకు ఎత్తుకొనుచున్నాడు. దీనినంతటినీ జీవుని అజ్ఞానమేయని చెప్పవచ్చును.

ఇంతకుముందు ప్రశ్నలో నీవు ఆధ్యాత్మిక విద్యకు బ్రహ్మవిద్యకు తేడాను అడుగుచూ రెండు ఒకటేనా?యని అన్నావు. విశ్వములో యున్న విద్యలలో ఒక విద్యయే అన్నిటికంటే పెద్దది. అదే దేవున్ని తెలియు బ్రహ్మవిద్య అని నేను చెప్పియున్నా, ఇప్పుడు దేవున్ని తెలియు విద్యయే లేదని చెప్పు చున్నాను. ఒకవేళ నేను పొరపాటుగా దేవున్ని తెలియు విద్య ఉందని అనుకొంటే **దేవుడు ఒక విద్యకు దొరుకువాడుగా లేక దేవుడు ఒక విద్యకు తెలియబడువాడుగా చెప్పినట్లగును. దేవుడు వాస్తవముగా ఏ విద్యకు తెలియబడువాడు కాదు. దేవుడు విద్యకు పరిమితియైనవాడు**

**కాదు.** బహుశా నేను ఇప్పుడు చెప్పుబోధ ఇప్పుడు నావద్ద తప్ప ఇంకెక్కడా వినియుండరు, చదివియుండరు. దేవుని గురించి అందరూ చెప్పునది ఒక విధానముగా యుండగా ఇప్పుడు 'దేవుడు బ్రహ్మవిద్యకు కూడా తెలియబడడు' అని చెప్పడము విచిత్రముగా ఉంటుంది. అంతెందుకు ఇంతకు ముందు దేవున్ని గురించి నేనే చెప్పిన బోధలకంటే విభిన్నముగా చెప్పడము నాకు మతి చలించిందన్నట్లు కనిపించినా ఇప్పుడు చెప్పునదే వాస్తవము. ఇంతకుముందు చెప్పినది దేవున్ని గురించి, ఇప్పుడు చెప్పునది ఆత్మను గురించి. ఇంతకు ముందు చెప్పినది దేవుని గౌరవార్థమేగానీ వాస్తవము కాదు. జ్ఞానులయినా సంపూర్ణ జ్ఞానులు కానివారికి ఇప్పుడు కూడా నేను దేవుడు బ్రహ్మవిద్యకు తెలియబడునని చెప్పుదును. అయినా సత్యము నా లోపల ఎరుకలోయున్నా, సందర్భమునుబట్టి వారికి అలాగే చెప్పవలెను. కావున అట్లు చెప్పవలసి వచ్చినది. సంపూర్ణ జ్ఞానులయిన వారికి అంతా సత్యమునే చెప్పనగును. అందువలన ఇప్పుడు అణిగియున్న ఆత్మను బయల్పరచుచూ దేవుడు ప్రత్యేకమయిన వాడు, ఆత్మే అన్నీ చేయుచుండగా, దేవుడు ఏమీ చేయక సాక్షిగా యుండునని చెప్పుచున్నాను. ఈ విధముగా అందరూ చెప్పలేరని అర్థము చేసుకోండి.

**బ్రహ్మవిద్య యనగా పెద్ద విద్య అని అర్థము.** బ్రహ్మ అంటే పెద్ద అని చెప్పబడుచున్నది. ప్రపంచములో ఎవరు పెద్ద? అని అడిగితే తెలియని వారికి దేవుడే పెద్దయని చెప్పుదును. ఒకవేళ తెలిసినవారికయితే దేవుడు పెద్దయని చెప్పను. అలా చెప్పడము తప్పగును. ఎందుకనగా! దేవున్ని పరిమితి చేసి మాట్లాడినట్లగును. దేవుడు ఒక కొలతకు దొరికిన వానిగా చెప్పినట్లగును. నిజము చెప్పితే దేవుడు ఏ కొలతకు దొరుకువాడు కాడు. అందువలన సంపూర్ణ జ్ఞానులవద్ద అన్నిటికంటేపెద్ద దేవుడని చెప్పక

ఆత్మయని సమాధానము చెప్పెదను. దేవుని తర్వాత యుండునది ఆత్మే అయినందున అన్నిటికంటే పెద్ద ఆత్మయని చెప్పడములో తప్పులేదు. పైగా ఉన్న వాస్తవము కూడా అదే. దేవున్ని గురించి కొంత తెలిసిన వానికి దేవుని గురించే చెప్పాలి. దేవున్ని గురించి ఎక్కువ తెలిసిన వానికి దేవున్ని గురించి చెప్పక, దేవుని తర్వాతయున్న ఆత్మను గురించి చెప్పాలి.

'ఆధ్యాత్మికము' అనగా 'ఆత్మను ఆధ్యాయనము చేయడము' అని అర్థము. **ఆత్మను ఆధ్యాయనము చేయవచ్చును గానీ, దేవున్ని ఆధ్యాయనము చేయుటకు వీలులేదు. దేవుడు ఏ ఊహకు అందనివాడు అయినందున ఏ పరిశోధకుడుగానీ, ఏ పరిశోధనగానీ దేవున్ని గురించి తెలుపలేవు.** అయితే దేవుని గురించి ఎవరూ తెలియలేరా?యని కొందరు ప్రశ్నించవచ్చును. ప్రపంచములో ఇంతవరకు బ్రతికియున్నవాడు ఎవడయినా గానీ దేవున్ని తెలిసినవాడు, దేవున్ని చూచినవాడు లేడనియే చెప్పాలి. సంపూర్ణ జ్ఞాని అయినాగానీ, కర్మలను దహించుకొను యోగి అయినాగానీ, చనిపోయిన తర్వాత, మోక్షము పొందిన తర్వాత, కర్మలనుండి ముక్తి పొందిన తర్వాత, దేవునిలోనికి ఐక్యమైన తర్వాత దేవున్ని తెలియనగును. శరీరముతో బ్రతికియున్నప్పుడు ఎవడుగానీ, కర్మల శేషముండి పూర్తి చావు రాకముందు గానీ ఎవడూ దేవున్ని తెలియుటకు వీలులేదు.

ఆధ్యాత్మికము అనగా ఆత్మను ఆధ్యాయనము ఒనర్చడమని అర్థము. ఇంకా చెప్పితే ఆత్మను గురించి తెలుసుకోవడము అని చెప్పడము. ఆత్మను గురించి తెలియజెప్పు కేంద్రమును 'విశ్వ విద్యాలయము' అని అంటాము. బయట శాస్త్రబోధలను చెప్పు బోధనాలయములను విశ్వ విద్యాలయములు అనగా విన్నాము. వాటికి ఆ పేరు తగదు. ఎక్కడయితే ఆత్మ విద్య

బోధింపబడుచున్నదో అక్కడున్న దానిని విశ్వ విద్యాలయము అనవచ్చును. విశ్వ విద్యాలయములు రెండు రకములుగా యున్నట్లు తెలియుచున్నది. ఒకటి స్థూలము, మరొకటి సూక్ష్మము అని చెప్పవచ్చును. స్థూలమేమిటి? సూక్ష్మమేమిటి? అని ప్రశ్నిస్తే ఈ విధముగా చెప్పవచ్చును. దేవుడు తన జ్ఞానమును తెలియజేయు నిమిత్తము అధర్మముల నిర్మూలన చేయుటకు భూమిమీదికి రావాలనుకొన్నప్పుడు శరీరము ధరించి భగవంతునిగా వచ్చి జ్ఞానమును చెప్పిపోవును. భగవంతుడు వచ్చినది ఎవరికీ తెలియకున్నా ఆయన చెప్పు జ్ఞానమంతయూ విశ్వ విద్యకు సంబంధించినదే. అందువలన భగవంతుడు స్థూలముగా ఎక్కడవుండి బోధించినా ఆయన ఉన్న స్థలమే విశ్వవిద్యాలయమగును. భగవంతుడు భవనములో యున్నా, పూరిగుడిసెలో యున్నా అప్పటికి అదే విశ్వ విద్యాలయముగా చెప్పబడును.

కనిపించని దేవుడు ప్రజలకు జ్ఞానము చెప్పుటకు కనిపించే భగవంతుడుగా శరీరమును ధరించి రావలసియున్నది. అలా వచ్చినప్పుడు ఆయనను ఎవరూ గుర్తు పట్టలేకపోయినా ఆయన మాత్రము తన జ్ఞానమునే బోధించును. దేవుని ధర్మమును అనుసరించి దేవుడు సూక్ష్మముగా ఉండినప్పుడు ప్రజలకు జ్ఞానమును చెప్పలేడు. దేవునిగా మనుషులతో ఎటువంటి సంబంధము ఉండదు. దేవుడు ప్రత్యక్షముగా సంబంధము లేనిదానివలన, దేవుని జ్ఞానమును ప్రజలకు తెలుపు నిమిత్తము, ఆయన దేవుడుకాని భగవంతుని వేషమును ధరించవలసి వచ్చినది. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులకు ఎవరికీ తెలియని దానివలన, తన జ్ఞానమును తానే ఏదో ఒక విధముగా చెప్పవలసియుండును. అందువలన దేవుడు తన యోచన చేత తానే భగవంతునిగా మారి ప్రజలతో ప్రత్యక్షముగా సంబంధమును పెట్టుకుని తన జ్ఞానమునంతటినీ చెప్పును. సృష్టి మొదటి

నుండి దేవుడు భగవంతునిగా ఎన్నిమార్లు వచ్చాడో చెప్పలేముగానీ, ఇప్పుడు మనకు తెలిసి ద్వాపరయుగము చివరిలో ఒకమారు, కలియుగములో ఒకమారు వచ్చిపోయినట్లు తెలిసినది. ఇదే కలియుగములోనే దేవుడు భగవంతునిగా మూడవమారు రావలసియున్నది. దేవుడు సూక్ష్మమైన వాడు కాగా, భగవంతుడు స్థూలమైనవాడు. ఆయన వచ్చినప్పుడు చెప్పుబోధ దేవుని జ్ఞానమే అని చెప్పినా, అది నేరుగా పరమాత్మ జ్ఞానముగా ఉండదు, ఆత్మజ్ఞానము వరకే ఉండును.

"దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులకు తెలియదు" అని చెప్పుటకు ఆధారముగా అంతిమ దైవగ్రంథములో సూరా 3లో ఆయత్ 7లో కలదు. అంతేకాక "దేవుడు తన ప్రతినిధిగా తన ఆత్మనే పంపునని" ఖురాన్ గ్రంథములో సూరా 15లో ఆయత్ 29లో గలదు. "దేవుడు భగవంతునిగా శరీరము ధరించి వస్తానని" భగవద్గీతలో జ్ఞానయోగమందు చెప్పబడినది. దేవుడు భగవంతునిగా మారిపోయి స్థూల మనుషులతో స్థూల భగవంతునిగా బోధ చెప్పును. అప్పుడు చెప్పుబోధ దేవునిలో మధ్యనున్న వాడయిన ఆత్మను గురించియే చెప్పును. మధ్యాత్మ అందరిలో ఉండుట వలన ఆత్మను **సర్వధారి** అని అంటున్నాము. విశ్వములో గల జనులలో అందరిలో ఉండుట వలన ఆయనను (మధ్యాత్మను) విశ్వరూపుడని కూడా అన్నారు. మహా భూతములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి యందు ఆత్మయుండుట వలన విశ్వమంతా ఆత్మయుండి విశ్వ రూపుడైనాడు. ఆత్మను గురించి భగవద్గీతలో భగవంతుడు చెప్పినా, బైబిలులో చెప్పినా అదియంతయు దేవున్ని గురించి చెప్పినదిగానే లెక్కించారు. అయితే అక్కడ చెప్పినది ఆత్మను గురించియని ఎవరూ ఇంతవరకు తెలియలేక పోయారు.

నేడు ఆశ్రమములు, ఆధ్యాత్మిక పీఠములను నెలకొల్పిన స్వామీజీలు, మేము బాబాలమని చెప్పుకొనువారు ఎందరో గలరు. నేడు ఆధ్యాత్మిక ఉపన్యాసములు అనేకచోట్ల జరుగుచున్నవి. అయినా ఆత్మను గురించి ఎవరూ చెప్పుకోవడములేదు. ఎవరు చెప్పినా దేవున్ని గురించి చెప్పుచున్నారే తప్ప దేవునికి, జీవునికి మధ్యలోయున్న మధ్యాత్మను గురించి ఎవరూ చెప్పడము లేదు. వారు చెప్పు బోధలలో ఆత్మయను పేరు చాలామార్లు వినిపించుచుండినా, ఆత్మంటే ఏమిటని? ఎవరూ ఆలోచించడము లేదు. నేడు భూమిమీదగల జ్ఞానులందరూ జీవాత్మ, పరమాత్మల విషయమే చెప్పుచుందురుగానీ, జీవునికి, దేవునికి మధ్యలోయున్న ఆత్మను గురించి ఎవరూ చెప్పడము లేదు. అందువలన ఇటు ప్రజలకుగానీ, అటు స్వాములకుగానీ ఆత్మను గురించి తెలియకుండాపోయినది.

**ప్రశ్న :- ఆత్మను గురించి ఎవరికీ తెలియకుండా పోయినదని మీరు చెప్పుచున్నారు. అటువంటప్పుడు ఆత్మను గురించి ప్రత్యేకముగా మీకు ఎలా తెలిసింది? అని మాకు ప్రశ్న గలదు దీనికి జవాబు చెప్పండి.**

**జవాబు :-** భూమిమీద పుట్టిన స్వామీజీలందరికి మధ్యలోయున్న ఆత్మ తెలియకుండా పోయినదను ఉద్దేశ్యముతో ఆత్మను గురించి తెలుపమని దేవుడే నన్ను పంపినట్లు నాకర్థమయినది. అంతేకాక నేను పుట్టక పూర్వము దాదాపు 350 లేక 400 సం॥లప్పుడు పుట్టిన బ్రహ్మముగారు తన కాల జ్ఞానములో నన్ను గురించి అనేక వాక్యములు వ్రాస్తూ, అందులో ఒక వాక్యమునందు **"నేను చెప్పు బోధలలో మధ్యాత్మ ప్రకాశితంబయ్యేను"** అని చెప్పియున్నాడు. ఏష్య కాలజ్ఞానములో ఈ మాట గలదు. దేశములో పుట్టిన స్వామీజీలందరి చూపు జీవుడు, దేవుడు మీదికే పోయినది. జీవుడు

దేవున్ని తెలియడమే ఆధ్యాత్మికము అన్నారు. అదే బ్రహ్మవిద్యయని కూడా అన్నారు. అయితే నాకు యుక్తవయస్సు నుండే జీవాత్మ, పరమాత్మల మీద దృష్టి కలుగడమేకాక, ప్రత్యేకించి మధ్య ఆత్మ మీద దృష్టి ప్రాకినది. అందువలన అద్వైతమును ఆదిశంకరాచార్యులు, విశిష్టాద్వైతమును రామానుజాచార్యుల వారు, ద్వైతమును మధ్వాచార్యుల వారు ప్రతిపాదించి నట్లు నేను **త్రైత సిద్ధాంతమును** ప్రతిపాదించడము జరిగినది. **దేవుడు మూడు ఆత్మలుగా యున్నాడని తెలుపు సిద్ధాంతమునే త్రైత సిద్ధాంతము అని అంటారు.** నేను త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించి అందులో మధ్యాత్మను గురించి ఎక్కువగా చెప్పడమైనది. నేను మధ్యాత్మను గురించి ప్రచారము చేయుదునని శ్రీ పోతులూరి వీర బ్రహ్మముగారు తన 'కాల జ్ఞానములో' ముందే వ్రాసియుంచారు. వీరబ్రహ్మము గారికి నాలుగు వందల సంవత్సరముల క్రిందటే నేను మధ్యాత్మను గురించి చెప్పుదునని ఎలా తెలిసిందోగానీ ఆయన చెప్పినది సత్యమయినది. ఆయన మాట ప్రకారము నేను త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించి చెప్పడమేగాక, ఇంతవరకు ఎవరూ చెప్పని ఆత్మను గురించి చెప్పడమైనది. **నీకు ఎలా తెలిసింది? అనునది మీ ప్రశ్న అయితే నాలోని ఆత్మే ఈ విధముగా చెప్పించినదనునది నా జవాబు.**

ఇప్పుడు అసలు విషయానికి వచ్చి విశ్వ విద్యాలయమును గురించి చెప్పితే విశ్వ విద్యాలయములు స్థూలముగా ఉన్నాయి, సూక్ష్మముగా ఉన్నాయి అని చెప్పాము. దేవుడు భగవంతునిగా, కనిపించే మనిషిగా వస్తే ఆయన ఎక్కడయుండి బోధిస్తే అదే విశ్వవిద్యాలయముగా చెప్పబడును. భగవంతుడు బోధించునది విశ్వమంతా ఆత్మగా వ్యాపించియున్న దానిని గురించి చెప్పడము వలన ఆ బోధ బోధించు జాగానే విశ్వ విద్యాలయము

అని చెప్పవచ్చును. అదియంతయూ దేవుడు భగవంతునిగా వస్తే అప్పుడు స్థూలముగా విశ్వవిద్యాలయమున్నదని చెప్పవచ్చును. **దేవుడు భగవంతునిగా వచ్చిన సమయమేదో ఎవరికీ తెలియని దానివలన భగవంతుడు గుర్తింపబడడు, అట్లే విశ్వ విద్యాలయము గుర్తింపబడదు.** విశ్వ విద్యాలయము స్థూలముగా యున్నా అది ఎవరి చేత గుర్తింపబడకుండా యుండును. బయట ప్రపంచములో గణిత, ఖగోళ, రసాయన, భౌతిక శాస్త్రములను బోధించు విశ్వ విద్యాలయములనునవి పెద్దపెద్ద భవన సముదాయమును కల్గియున్నవి. ఇప్పుడు మనము ప్రపంచ సంబంధ విశ్వ విద్యాలయములను గురించి మేము అడగడము లేదు. కేవలము ఆధ్యాత్మిక విద్యకు సంబంధించిన బ్రహ్మవిద్యా శాస్త్రమును గురించి అడుగుచున్నాము. బ్రహ్మవిద్యాశాస్త్రమునకు సంబంధించిన విశ్వ విద్యాలయము ఫలానా చోట యుందని ఎవరూ చెప్పలేరు. అట్లే బ్రహ్మవిద్యకు సంబంధించిన విశ్వ విద్యాలయములో బోధకుడు ఎవడయినదీ తెలియదు. బ్రహ్మవిద్యకు సంబంధించిన విశ్వ విద్యాలయము ఎవరికీ తెలియదు. అట్లే దానిలో ఎవరు బోధించునది తెలియదు. ఇట్లు స్థూలముగాయున్న విశ్వ విద్యాలయమును గురించి ఇప్పుడే కాదు భవిషత్తులో ఎప్పుడు కూడా ఎవరూ చెప్పలేరు.

సూక్ష్మమైన అనగా కనిపించని విశ్వ విద్యాలయములో ఎవరు బోధించునదీ, బోధించు బోధకుడు ఏమి బోధించుచున్నాడని ప్రశ్నించితే కనిపించని దానిని గురించి ఏమీ చెప్పలేము అని అంటున్నారు. ఇప్పుడు మనము కనిపించని విశ్వ విద్యాలయమును గురించి తెలుసుకోగలిగితే, కనిపించని విశ్వ విద్యాలయములో బోధించువాడు ఆత్మయేనని తెలియుచున్నది. ఆత్మ బోధించడమును **"ఆత్మ ప్రబోధము"** అంటున్నాము. ఆత్మ

జీవముగల శరీరములో అణిగి ఎవరికీ తెలియకుండా యుంటూ, ఎవరికీ తెలియకుండా జ్ఞానమును బోధించుచున్నది. ఆత్మ శరీరములోయున్నదని జ్ఞానులుగాయున్న వారికే తెలియదు. సాధారణ మనుషులకు ఆత్మ విషయమే కాదు, దేవుడు కూడా తమలో ఉన్నాడని తెలియదు. శరీరములో తాను (జీవుడు) ఒక్కడే యున్నట్లు తలచుచున్నాడు. జ్ఞానులనిపించుకొన్నవారు, బోధించు స్థోమతగల స్వామీజీలకు సహితము జీవాత్మ, పరమాత్మతో పాటు శరీరములో ఆత్మకూడా యున్నదను విషయము తెలియదు. తెలియక పోవడము వలన అన్ని పనులను జీవుడే చేయుచున్నాడని తలచుచున్నారు. అందువలన స్వామీజీలు సహితము పాపములో కూరుకపోవుచున్నారు. జీవుడు పనులు చేయకున్నా పనులు చేశానని, చేస్తున్నానని తలచుట చేత అతనికి కర్మబంధనములు ఏర్పడుచున్నవి. లోకములోని ప్రజలందరికీ ఆత్మ శరీరములోయుండి, ఆత్మే పని చేయుచున్నదని ఏమాత్రము తెలియడము లేదు. ఆత్మ విషయమును తెలియని ఎవరినైనా అజ్ఞానులు అని అనవలసిందే!

ఆత్మయొక్క జ్ఞానమును తెలిసిన వారికంటే తెలియనివారే అధిక సంఖ్యలోయున్నారు. సామాన్య మనుషుల విషయము కాకుండా జ్ఞానమును బోధించు స్వామీజీలయిన వారికే ఆత్మ విషయము తెలియకుండా పోయినది. ఆత్మ విషయము తెలియని దానివలన వారు నేరుగా దేవున్ని గురించిన బోధలను చెప్పుచున్నారు. దేవున్ని గురించిన బోధలు ఎన్ని చెప్పినా, అవి వినేదానికి బాగుండునుగానీ, అది ప్రత్యక్ష ప్రమాణ జ్ఞానముగా యుండదు. దేవున్ని గురించి చెప్పు బోధలన్నీ జవాబు లేని ప్రశ్నగా మిగిలిపోవుచున్నవి. 'రూప, నామ, క్రియలు లేనివాడు దేవుడు' అన్నప్పుడు ఆయనను గురించి చెప్పు బోధలన్నీ రూప, నామ, క్రియలతో

కలిసియుండును. అందువలన చెప్పబడిన దేవుని జ్ఞానము ప్రశ్నించితే జవాబుగా నిలువకుండా పోవుచున్నది. అందువలన మనిషి ఆత్మజ్ఞానమును తెలియకుండా నేరుగా దేవుని జ్ఞానమును తెలియుట వలన ఏమీ ప్రయోజనము లేదు. అటువంటి జ్ఞానము సంశయములమయమై చివరకు లేకుండా పోవును. జ్ఞానము అనగా ప్రతి దానికి జవాబై యుండునది. ఎప్పుడయితే జవాబు లేదో అప్పుడు అతనిలో అజ్ఞానమున్నట్లే యగును. అట్లు కాకుండా "నాకు దైవ జ్ఞానము అవసరము, నేను ఏది ముందు, ఏది వెనుకల తెలియవలెనో నాకు తెలియదు, అందువలన నీవే నాకు జ్ఞానమును బోధించవలెనని" కోరుకొన్నట్లయితే శరీరములోని ఆత్మ, పరమాత్మలలో పరమాత్మ మాట్లాడక చూస్తూ యుండగా, ఆత్మే అన్ని పనులు చేయు కర్తగాయుండుట వలన జ్ఞానమును చెప్పు కార్యమును కూడా ఆత్మే చేయును.

**ప్రశ్న :- అడిగినంతమాత్రముననే లోపల జరిగిపోవుటకు, ఆత్మ బోధించుటకు ఆత్మ ఏమయినా మనిషికి గుమస్తా పనిని చేయుచున్నదా?**

**జవాబు :-** అట్లని ఆత్మ అన్నిటికీ సమాధానమిస్తుందని నేను చెప్పలేదు. దేవుని మార్గములో ప్రయాణించు వారికి సంశయములు కల్గినప్పుడు, అదియు వాడు ఆత్మమీద నమ్మకము కల్గియుండి, సమాధానమును అడిగినప్పుడు మాత్రమే లోపల నుండి సమాధానము దొరుకుచున్నది. ఈ విషయమును అంతిమ దైవగ్రంథములో సూరా 2, ఆయత్ 186 నందు చెప్పియున్నారు చూడండి. **(2-186) "నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే, నేను వారికి అతి సమీపములో యున్నాను. పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని పిలుపును విని జవాబిస్తాను. కాబట్టి**

**వారు సరైన మార్గము పొందటానికి నా ఆజ్ఞను అనుసరించాలి మరియు నాయందు విశ్వాసము కల్గియుండాలి"** అని చెప్పు.

దేవుని మార్గములో ప్రయాణించు వానికి మాత్రము దేవుడు (ఆత్మ) వాని మాటకు సమాధానమిచ్చునని చెప్పియున్నాడు. దేవుడు (ఆత్మ) చెప్పినట్లు నడుచుకొనువాడు సరియైన మార్గమును పొందునని తెలియ జేశాడు. ఇక్కడ అడిగిన ప్రశ్నకు అదియూ దైవసంబంధమైన వాటికే జవాబు దొరుకునని చెప్పాడు. చెప్పేవాడు దేవుడు అని దేవుని గౌరవార్థము చెప్పాము గానీ వాస్తవముగా ఆత్మయే జవాబిచ్చునని తెలియవలెను. దేవుడు శరీరములో యున్న ఎవరితోనూ మాట్లాడువాడు కాదు, ఎవరికీ పలుకడు. జీవునికి అత్యంత సమీపమున యున్నవాడు ఆత్మయే. దేవుడు మాట్లాడడు, మాట్లాడువాడు ఆత్మ ఒక్కడు మాత్రమే. అందువలన సరియైన దేవుని మార్గములో ప్రయాణించవలెనని అనుకొన్నవాడు సంశయముల మధ్య చిక్కుకొన్నప్పుడు, వాడు నన్ను (ఆత్మను) తలచినప్పుడు నేను వాని సంశయము నకు జవాబిస్తాను. అప్పుడు అతడు సరియైన జ్ఞానమును పొంది సక్రమముగా ప్రవర్తించవచ్చును. చాలామందికి శరీరములోని ఆత్మయే జవాబిస్తుందని తెలియదు. జీవునితోపాటు, దేవునితోపాటు శరీరములో ఆత్మయుందను విషయము తెలియకపోవడము అజ్ఞానములో మొదటి అజ్ఞానమగును. ఆత్మ ప్రబోధముంటుందని తెలియనివారు అంతర్ముఖముగా ప్రశ్నను అడుగలేరు. ప్రశ్న అడినప్పుడే జవాబు లభించును అని చెప్పియున్నారు. ఉన్న వాస్తవము కూడా అంతే!

భగవంతుడు భూమిమీద యున్నప్పుడు మనిషికి ప్రత్యక్షముగా సమాధానము చెప్పగలడు. భగవంతడు భూమిమీద లేనప్పుడు జ్ఞానము మీద శ్రద్ధ గలిగిన నిజమైన దైవభక్తునికి సరియైన సమాధానము బయట

ఎవరి వద్దా లేనప్పుడు శరీరములోని ఆత్మయే జవాబు చెప్పాలి. అందువలన అంతిమ దైవగ్రంథములోని వాక్యములో **"నా దాసులు నన్ను గురించి అడిగినప్పుడు"** అని అన్నాడు. 'నా దాసులు' అనగా 'నా భక్తులు' అని అర్థము. నా భక్తులు అని ఎవరిని చెప్పారని అన్నట్లయితే ఆత్మమీద విశ్వాసము కలిగియున్న వారని అర్థము. **"నన్ను అడిగితే నేను వారి పిలుపును విని జవాబిస్తాను"** అని చెప్పియున్నారు. ఆత్మ మీద నమ్మకమున్నవాడు ఆత్మను అడిగితే 'వాని పిలుపును' అనగా వాడు అడిగిన దానికి జవాబిస్తాను అన్నాడు. అలా ఇచ్చిన జవాబు మనిషిని సరియైన జ్ఞానమార్గములో నడిపించగలదు. ఇది ఆత్మను నమ్మి, ఆత్మ శరీరమును నడిపించడమేకాక, సర్వ జ్ఞానములు ఆత్మకు తెలియునని తెలిసిన వానికి ఆత్మ అతని అంతఃరంగములోనే ఆత్మజ్ఞానమును బోధించును.

నేను అనేక సమయములలో జ్ఞానము చెప్పునప్పుడు, 'నేను చెప్పిన జ్ఞానము ఎవరికీ తెలియనిదిగా, క్రొత్తగాయున్నప్పుడు ఇది నాకు నాలోని వాడు తెలుపగా నాకు తెలిసినదియని' చెప్పాము. నాలో నాకు అత్యంత సమీపమునయున్న వాడయిన ఆత్మ తెలిపిన విషయములను అనేకము నేను గ్రంథములలో వ్రాయడము జరిగినది. ఉపన్యాసములలో చెప్పడము జరిగినది. నా జీవితములో మొదటినుండి ఇప్పటి వరకు అదే జరిగినది. అందువలన నాలోని వాడు (ఆత్మ) తెలిపినదని చాలామార్లు చెప్పడమైనది. మధ్య దైవగ్రంథమయిన సువార్తలలో ఏసు **"నీ పొరుగు వానిని ప్రేమించుము"** అని అన్నాడు. అక్కడ 'పొరుగువాడు' అని ఆత్మనే చెప్పాడు. భగవద్గీతలో దాదాపు 250 శ్లోకములలో ఆత్మను గురించి చెప్పినట్లు గలదు. ఈ విధముగా మూడు గ్రంథములలో ఆత్మను గురించి చెప్పియుండగా నా అనుభవములో నాకు తెలియని జ్ఞానమంతా ఆత్మే చెప్పియుండగా,

మిగతా జ్ఞానులనువారు ఆత్మను గురించి ఎందుకు నమ్మరో తెలియడము లేదు.

**ప్రశ్న :- అంతిమ దైవగ్రంథములో తన దాసులకు మాత్రము వారి పిలుపును విని, వారి అభ్యర్థనకు సరియైన జవాబిస్తానని, జీవునికి శరీరములోనే అతి సమీపముగాయున్న ఆత్మ చెప్పియున్నట్లు గలదు. తన భక్తులకు మాత్రము దారి చూపు ఆత్మ, మిగతా దేవతా భక్తులకు దారిచూపడనేగా అర్థము. ఏ కార్యము చేసినా శరీరములో ఆత్మే చేయాలి అని గలదు. అలాంటప్పుడు అజ్ఞానులయిన వారికి అడుగకనే దారి చూపవచ్చును కదా! వారు ఆత్మయిన తనను గురించి తెలియదని తలచి తానే స్వయముగా దారి చూపవచ్చును కదా! ఆత్మ దారి చూపకపోతే అజ్ఞానుల దారెటు వైపుకు పోవును?**

**జవాబు : -** బయట ప్రపంచములోని విద్యాలయములలో విద్యార్థులను చూస్తే వారు చదువుచున్న చదువులో ఉత్తీర్ణులగువారు (పాస్ అయ్యేవారు) ఉన్నారు. అట్లే ఉత్తీర్ణులు కానివారు (ఫెయిల్ అగువారు) గలరు. ఒకే తరగతిలో ఒకే బోధలో కొందరికి పాస్‌మార్కులు రాగా, కొందరికి ఫెయిల్ మార్కులు వస్తున్నవి. దీనినిబట్టి ఒకే తరగతి, ఒకే బోధకుడు, ఒకే బోధ యున్నప్పటికీ పాస్, ఫెయిల్ అను రెండు రకముల వారు తయారగు చున్నారు కదా! పాస్ అయిన వానికి, ఫెయిల్ అయినవానికి ఏమి తేడా అని అంటే చెప్పిన బోధలో తేడా లేదుగానీ, వానికున్న శ్రద్ధలో తేడా గలదు. శ్రద్ధ బాగాయున్నవాడు పాస్ అయినాడు, శ్రద్ధ తక్కువ యున్నవాడు ఫెయిల్ అయినాడని చెప్పవచ్చును. వీరిలో ఇంకా వివరముగా చూస్తే పాస్‌మార్కులు 40 నుండి పైకియుండగా, పాసయిన వారిలో 41 మార్కులు

వచ్చి పాస్ అయిన వారున్నారు. 50 మార్కులు వచ్చినవారు, 60 మార్కులు వచ్చినవారు 70,80,90 మార్కులు వచ్చి పాసయిన వారు గలరు. పాసయిన వారందరు మార్కులలో ఒకే స్థాయివారు కాదని అరు లేక ఏడు రకముల స్థాయిల వారున్నారని తెలియుచున్నది. అదే విధముగా ఫెయిల్ అయిన వారిలో కూడా వారికి వచ్చిన మార్కులను బట్టి విద్యలో వారి స్థాయిలు వేరు వేరుగా ఉన్నాయని చెప్పవచ్చును.

అదే విధముగా అంతరంగములో గల జ్ఞాన విశ్వ విద్యాలయములో విద్యార్థులుగా యున్నవారు వారివారి జ్ఞానములో అనేక స్థాయిలుగా యున్నట్లు తెలియుచున్నది. దైవ భక్తులము అనియు లేక జ్ఞానులమనియు చెప్పుకొను వారందరినీ స్వాముల వద్దనుండి సన్యాసుల వరకు లెక్కించి చూస్తే అందరూ జ్ఞానమను విశ్వ విద్యాలయములో విద్యార్థులుగానే యున్నారు. జ్ఞానుల విశ్వ విద్యాలయము వారివారి శరీరములలోనే ప్రతిష్ఠింప బడియున్నది. శరీరమను విశ్వ విద్యాలయములో ఆత్మయే బోధకుడుగా యున్నది. భగవద్గీతలో జ్ఞానయోగమునందు గల 39వ శ్లోకములో **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"** అని చెప్పియున్నట్లు మేము భక్తులము, స్వాములము, జ్ఞానులము అను వారికి గల శ్రద్ధనుబట్టి వారికి జ్ఞానము లభించడము, ముక్తి దొరకడము జరుగునని చెప్పియున్నారు. దాని ప్రకారమే శరీరము నందు గల విశ్వ విద్యాలయములో మనుషులకున్న శ్రద్ధనుబట్టి వానికి ఆత్మ తన జ్ఞానమును బోధించుచున్నది. ఇక్కడ ముఖ్యముగా గమనించుకోవలసిన విషయమొకటున్నది. అది ఏమనగా!

జ్ఞానమున్న వారికి జ్ఞానములేని వారికి అందరికీ ఆత్మనే శరీరమను విశ్వ విద్యాలయములో బోధించడము జరుగుచున్నది. మనుషులకున్న శ్రద్ధనుబట్టి వానికి ఏది అవసరమో దానినే బోధించుచున్నది. జ్ఞానులయిన

వారు ఆతృతతో అడిగిన వారికి తగిన జ్ఞానమును అందించగా, శ్రద్ధలేని వారు అడుగకున్నా వాని శ్రద్ధనుబట్టి వానికి ఏమి అవసరమో దానినే ఆత్మ అందించుచున్నది. శరీర విశ్వ విద్యాలయములో ఆత్మే అన్నీ చేయుచున్నా, చేయు పనులను అనగా జరిగిన పనులను ఆత్మ చేసింది అని చెప్పకుండా దేవుడు చేశాడని, దేవుని మీద గౌరవార్థముగా ఆత్మయే అంటున్నది. శరీరములో మనిషి అనునట్లు తెలియు ప్రతిమాటను పనిచేయు ఆత్మే పలుకుచున్నది. ఆత్మ అణిగి యుండునది, బయటపడునది కాదు. అందువలన తాను చేయు అన్ని పనులను దేవుని మీద పెట్టి, దేవుడే చేయుచున్నాడని అందరి చేత పలికించుచున్నది. ఈ విషయమై ఇది దేవుని మీద గౌరవార్థమేగానీ వాస్తవముగా దేవుడు ఏమీ చేయలేదు. దేవుడు ఏమీ చేయువాడు కాడు, క్రియారహితుడని చెప్పుకొన్నాము. దేవుడు చేయని వాడుగా యున్నా, ఆత్మ అన్నీ చేయునదిగా యున్నా దేవుని మీద గౌరవముతో ఆత్మ అలా చెప్పినదని అనుకోవాలి.

శరీరములో నివశించు జీవులందరికీ ఎవరికి ఏమి అవసరమో వారి కర్మనుబట్టి వారికి అది లభించునట్లు చేయుచున్నది. ఎవరు అడుగ కున్నా వారికి తెలియకుండా, వారి వెనుకయుండి వారి కర్మ ఫలితమును బట్టి దానిని చేయడము, మాట్లాడడము ఆత్మ చేయుచున్నది. అజ్ఞానులయిన వారికి తమను ఆత్మ నడుపుచున్నదని తెలియకున్నా, వారిని స్వయముగా ఆత్మయే నడుపుచున్నది, అడుగకున్నా జవాబు చెప్పుచున్నది. ఈ విధముగా శరీరమను యంత్రమునకు ఆత్మ డ్రైవర్‌గాయున్నది. జ్ఞాన విషయములో "శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్" అను సూత్రము ప్రకారము అజ్ఞానులకు ఏ జ్ఞానము అవసరమో, జ్ఞానులకు ఎంత జ్ఞానమవసరమో అంత జ్ఞానమును అందించుచున్నది. పైగా అడుగు జ్ఞానులకు కూడా జవాబు చెప్పుచున్నది.

ఎవరు అడిగినా జవాబు చెప్పగల ఆత్మ ఎవరికి ఏది అవసరమో దానినే చెప్పగలదు. జ్ఞానులలో ఎన్నో తేడాలుగలవు. వారిలో సంపూర్ణ జ్ఞానులు గలరు, అసంపూర్ణ జ్ఞానులు గలరు. 100 మార్కులున్నవారు గలరు. 40,50,60 మార్కులున్న వారు గలరు. జ్ఞానులలో వారి జ్ఞానమును వారికి హోదాను నిర్ణయించువాడు ఆత్మయే. నా ఎడల ఆత్మ ఎట్లు వర్తించు చున్నదో నాకు బాగా తెలుసు. **అందరినీ నడిపించునదీ, ఏడ్పించునదీ, నవ్వించునదీ, కవ్వించునదీ, నిరుత్సాహపరచునదీ అన్నీ ఆత్మయే అయినా అన్నీ దేవుడే చేస్తున్నాడని అందరూ అనుకోవడము జరుగుచున్నది.** జ్ఞానులకు, అజ్ఞానులకు ఏ ఒక్కరికీ తమలోయుండి అన్నీ చేయుచున్న ఆత్మ మీద దృష్టి ప్రాకలేదు. నా విషయము చెప్పితే నేను దాదాపు 40 సంవత్సరముల క్రిందటే ఆత్మను తెలియగలిగాను. అప్పుడే మన శరీరములో మూడు ఆత్మలున్నవని చెప్పుచూ వచ్చాను. అయినా నా మాటను ఎవరూ లెక్కించలేదు. ఇప్పటికి 38 సంవత్సరములప్పుడు మూడు ఆత్మల సిద్ధాంతమును ప్రతిపాదించి, దానికి అద్వైతము, ద్వైతమువలె త్రైత సిద్ధాంతమని పేరు పెట్టడము జరిగినది. అప్పటినుండి ఇప్పటి వరకు ఒకే త్రైత సిద్ధాంతము మీద దాదాపు 80 గ్రంథములను వ్రాయగలిగాము. ఇప్పుడు 75వ గ్రంథముగా **"విశ్వ విద్యాలయము"** అను ఈ గ్రంథమును విడుదల చేయుచున్నాము. త్వరలో నూరు గ్రంథములను నాలోని ఆత్మే పూర్తి చేయదలచినది.

దాదాపు 40 సంవత్సరములనుండి త్రైత సిద్ధాంతము ప్రకారము జీవాత్మ, పరమాత్మ మధ్యలో ఆత్మయుందని చెప్పుచున్నా నా మాటను వినని వారు, నా మాటలోని సత్యమును గ్రహించని వారు నన్ను త్రిత్వమును బోధించు క్రైస్థవుడని అన్నారు. ఎందరో నన్ను దూషణగా మాట్లాడి పర

మతమును బోధించుచున్నాడని ఆరోపణలు చేశారు. అయినా అలా వారిలో వుండి అనువారు కూడా ఆయనే (ఆత్మనే) యని నాకు తెలుసు. అలా వ్యతిరేఖముగా మాట్లాడినప్పుడు, నాకు వ్యతిరేఖముగా పని చేసినప్పుడు ఆత్మను మరచిపోయి నాకు వ్యతిరేఖత చేసినవారు, మాట్లాడినవారు మనుషులేనని అనుకుంటానేమోనని పరీక్షించుటకు అలా చేసినా, నేను ఆత్మను మరచిపోయి మనుషులు చేశారని అనుకోలేదు. భవిష్యత్తులో ఏదో మార్పుకు, అదియూ నా మేలు కొరకు, ఆత్మయే అలా చేశాడని అనుకొన్నాను. నేను అనుకున్నట్లు అలాగే జరిగింది. ఏ కోణమునుండి ఏమి జరిగినా, ఎవరి నుండి ఏమి మాటలు వచ్చినా, అవన్నీ బయటివే అయినా అన్నీ ఆత్మ పలుకులు, ఆత్మ పనులు అని ఇప్పుడేకాదు, ఎప్పటికీ అనుకుంటాను. కనిపించకపోతే తొంగి చూడాలి. బాగా కనిపించేటప్పుడు తొంగి చూడవలసిన పనిలేదు. అలాగే తెలియకపోతే చేసింది ఎవరని ఇతరులను అనుకోవాలి. కనిపించేటప్పుడు ఇతరులను అనుకోవలసిన పనిలేదు. **చేసినవాడు, చేయువాడు, చేయబోవువాడు ఆత్మే** అయినప్పుడు, ఆత్మే అని తెలిసినప్పుడు, నేను ఇతరులను గురించి ఎందుకు అనుకోవాలి? లోగుట్టు బహిరంగమైనప్పుడు బహిరంగమును లోగుట్టని ఎందుకు అనుకోవాలి?

నేను బహుశా 1999వ సంవత్సరములో మొదటిలో ఇక్కడికి 50 కిలోమీటర్ల దూరములో యున్న రెండు అక్షరముల పేరుతోయున్న ఊరిలో భగవద్గీతను వ్రాయడము జరిగినది. నేను పుట్టిన కులమునకు ఇంటి పేరు **'గుత్తా'** అని కలదు. ఒకప్పుడు గుత్తా అను పేరుండి, తర్వాత దానికి దగ్గర పేరుగా మార్పు చెందిన ఊరిలో భగవద్గీతకు భావమును వ్రాయాలను కొని, ఆ ఊరిలో చేరి రెండు ప్రక్కప్రక్క ఇళ్ళను కిరాయికి తీసుకొని,

ఒక ఇంటిలో భార్యాపిల్లలుండగా, మరొక ఇల్లు భగవద్గీతను వ్రాయుటకే ఉపయోగించుకొనుచుంటిని. ఇంటి యజమానికి ప్రతి నెల కిరాయి డబ్బులు చెల్లించుచూ ఏ లోపము లేకుండా భగవద్గీతను వ్రాయడము జరిగినది. భగవద్గీత వ్రాయడము అయిపోయినది. దేవుని సేవ చేశానని తృప్తిగాయున్న ఆ సమయములో ఇంటి యజమానికి మేమంటే సరిపోవడము లేదు. మేము రాత్రంతా మేలుకొని పని చేయడము, గ్రంథము వ్రాయడము వారికి నచ్చలేదు. వాస్తవముగా ఏ విషయములో నచ్చలేదో మాకు తెలియదుగానీ ఆమె ఇల్లు ఖాళీ చేయమని చెప్పడమైనది. అప్పుడు ఇంత మంచిగాయుండి పరిసర ప్రాంతమునంతటినీ శుభ్రముగా పెట్టి నిజాయితీగా యున్నా ఎందుకు ఇలా జరిగింది? అని కొంత బాధాకరమైన ఆలోచన రావలసింది. ఎవరయినా అలాగే అనుకొంటారు. అయినా నాకు అటువంటి ఆలోచన రాలేదు.

నాకు వచ్చిన ఆలోచన ప్రకారము అందరిలో వున్నవాడు, అందరిలో మాట్లాడువాడు, అందరినీ ఆడించువాడు ఇంటి యజమానిలో వుండి మనలను ఇల్లు ఖాళీ చేయమని చెప్పాడు. నేను కిరాయి ఇంటిలో ఉండి భగవద్గీతను వ్రాయడము సరిపోయివుండదు. ఆయన ఏదో మార్పు తెచ్చుటకు ఇక్కడినుండి కదిలించాలని అనుకుంటున్నాడు అని అను కొన్నాను. అప్పటి పరిస్థితిని బట్టి లోపల ఆత్మే కల్గించిన యోచన ద్వారా ఆ ఊరినే పూర్తిగా వదలి హైదరాబాదు ప్రక్కకు గల కొత్తకోట ఊరికి చేరడము జరిగినది. గుత్తినుండి హైదరాబాద్ 300 కిలోమీటర్లు కాగా సరిగ్గా 150 కిలోమీటర్ల మధ్య దూరములో యున్న ఊరికి చేరడము జరిగినది. అది కూడా ఆత్మయొక్క ప్రణాళికయేనని అనుకొన్నాను. అక్కడ నావద్దయున్న వారందరినీ పెట్టి హైదరాబాద్ చేరడము, తర్వాత అక్కడ

ఒక ఇల్లు కొనడము, ఒకదాని తర్వాత ఒకటి ఏడు ఇళ్ళను కొనడము జరిగినది. ఇదంతా జరుగుటకు పునాదిగా అక్కడ ఇతరులనుండి వ్యతిరేఖముగా మాట్లాడిన వాడు ఆత్మయేననీ, నాకు మంచి చేయుటకే అలా వ్యతిరేఖత చూపాడని అర్థమయినది. ఈ విధముగా మనిషి జీవితములో ఆత్మ అనుకూలముగా ఒకప్పుడు, వ్యతిరేఖముగా ఒకప్పుడు చేయడము మాట్లాడడము జరుగుచుండును. **అన్నీ ఆత్మే చేయుచున్నాడను ధ్యాస కల్గిన వానికి అన్నీ మంచే జరుగును.** నా అనుభవములో ఇలా ఎన్నో జరిగాయి. అన్నీ తండ్రియైన ఆత్మయే చేయుచున్నాడని అనుకున్నాను.

నేడు సంస్కృత శ్లోకములకు వివరము వ్రాయబడిన భగవద్గీతలు దాదాపు మూడు వందల పై మాటగానే ఉన్నాయి. వాటిని ఎంతో పెద్ద స్వామీజీలు జ్ఞానములో అనుభవమున్న వ్యక్తులు, పెద్ద గురువులుగా పేరుగాంచిన వారు వ్రాసియున్నారు. అయినా వాటిలో సరియైన వివరము లేదను భావముతో నేను భగవద్గీతకు వివరమును వ్రాయాలనుకోవడము జరిగినది. సంస్కృత శ్లోకములకు వివరము వ్రాయాలంటే ముందు సంస్కృత భాషను నేర్చియుండాలి. నాకు సంస్కృత భాష పరిచయమే లేదు. తెలుగు పదములకు కూడా సరియైన అర్థము తెలియనివాడిని. పదకొండు తరగతిని చదివిన వాడిని, పై చదువులు కూడా తెలియనివాడిని, సంస్కృత శ్లోకములకు వివరము వ్రాయడము ఏమిటి? అను ప్రశ్న ఒకవైపు యున్నా వ్రాయువాడను నేను కాదుకదా! నా చేత వ్రాయబడు భగవద్గీతను వ్రాయువాడు ఆత్మేనని తెలిసి, విశ్వ విద్యాలయ బోధకుడే వ్రాయు భగవద్గీత గొప్పగా వుండునని అనుకున్నాను. ఇంతకు ముందు వ్రాసిన వారిలో కూడా ఆత్మే వ్రాసియుండుట సత్యమే అయినా, వారి భావములు వేరుగా యుండుట వలన, మేము వ్రాయుచున్నామను భావము వారిలో ఉండుట

వలన, వారిలో ఎలా వ్రాయాలో అలాగే వ్రాసియుండును. ఇప్పుడు కూడా "నాలో నుండి వ్రాయు ఆత్మ ఏమి వ్రాయునో నేను కూడా తెలియవచ్చును" అని అనుకొన్నాను.

నేను ఏమీ తెలియని అజ్ఞానిగా ఉండగా, భగవద్గీత వ్రాయుటకు ఆత్మ పూనుకోగా, మొదటనే 'అర్జున విషాదయోగము' అను అధ్యాయము భగవద్గీత కాదని, మొదటి అధ్యాయమునకు వివరము వ్రాయకుండా నేరుగా రెండవ అధ్యాయము మొదలు పెట్టడము నాకు ఆశ్చర్యమయి నది. దానికి సంబంధించిన వివరమును 'రోగి, వైద్యుడు' అను వారి మధ్య జరిగిన సంభాషణలో **వైద్యము ఎవరిది?, రోగము ఎవరిది?** అని ప్రశ్నించి అడిగి రోగము రోగిది, వైద్యము వైద్యునిది అయినందున వైద్యము జాగాలో రోగమును చెప్పకూడదని వివరమిచ్చి, భగవద్గీతయనగా అర్జునునికి కృష్ణునికి మధ్య జరిగిన కృష్ణుని మాటలనే భగవద్గీత అనాలని, అర్జునుడు చెప్పినది విషాదము మాత్రమే అది మనకు అవసరము లేదు. భగవద్గీత ఇదేనని పదిహేడు అధ్యాయముల వివరమును వ్రాయడము ప్రథమముగానే రచయిత అయిన ఆత్మ గొప్పతనమేయని చెప్పవచ్చును.

భగవద్గీతను సాంఖ్యయోగములో పదకొండవ శ్లోకమునుండి మొదలు పెట్టినప్పుడు మొదటి శ్లోకములోని వివరమును భూమిమీద తయారైన భగవద్గీతలన్నిటికంటే ప్రత్యేకముగా వ్రాయడము, అక్కడ ఎవరూ చెప్పలేని వివరమును చెప్పడమును చూస్తే ఆత్మంటే ఏమిటో, ఆయన భావము ఎలాగుండునో అర్థము కాగలదు. ఎవరి ఊహకూ అందని వివరమును అక్కడ వ్రాశాడంటే అదొక ప్రత్యేకమయిన భావముగా తయారయినది. ఆ శ్లోకమునకు అర్థము వ్రాయబడినప్పుడు నేను దానిని

చూచి మొట్టమొదటిగా నేను ఆ వివరమును తెలిసినందుకు ఎంతో సంతోషించాను. ఇతరులు తర్వాత చదువవచ్చును, అయినా వారందరూ నా తర్వాత చదివిన వారగుదురు. నా శరీరములోని ఆత్మ వ్రాయుట చేత అందరికంటే ముందు చదువు భాగ్యము కల్గినది. ఇప్పుడు ఈ నా మాటను వినే వారికి కూడా కొంత అర్థమయి, కొంత అర్థము కాకుండా యుండవచ్చును. భగవద్గీతను వ్రాసినది నేను కాదు అను సత్యమును మీరు నమ్మగలిగితే నా మాటలు అర్థము కాగలవు. మీకు అర్థము అయినా, కాకపోయినా నేను చెప్పు మాటలు నూటికి నూరు శాతము సత్యము.

పదకొండవ శ్లోకమునుండి మొదలు పెట్టిన విశ్వ విద్యాలయ అధిపతియైన ఆత్మ మరొక పదకొండు శ్లోకములకు వివరమును వ్రాసి 22వ శ్లోకము వద్దకు పోయినప్పుడు, **'వాసాంసి జీర్ణాణి'** అను ఆ శ్లోకము నకు భావమును వ్రాసి క్రొత్త అద్భుతమును సృష్టించాడు. ప్రపంచములో ఎంత పెద్ద రచయితల వద్ద కూడా ఆ భావమును వ్రాయలేదు. ఆ శరీరములలో రచయితల భావములు ఉండుట వలన ఆత్మ వారి భావములకు తగినట్లు సర్వసాధారణముగా వివరమును వ్రాశాడు తప్ప ఇక్కడ నావద్ద వ్రాసినట్లు వ్రాయలేదు. నా శరీరములో నా భావములు ఏమీ లేనందున ఉన్న భావమంతా ఆత్మదే అయినందున, స్వచ్ఛమయిన ఆయన భావమునే వ్రాయడము జరిగినది. అందువలన అక్కడ శ్లోకమునకు వ్రాసిన భావము యొక్క రహస్యమును అర్థము చేసుకొనుటకే బుర్రలు చాలవు. ఒక్క శ్లోకమునకు 42 పేజీల వివరమును వ్రాసి సైన్సుకే సైన్సు అయిన సూపర్ సైన్సు ఎలాగుంటుందో తెలియజేశాడు. అది ఎవరూ కనీవినీ ఎరుగని వివరము లేక రహస్యము అని చెప్పవచ్చును. ఇంతకుముందు ఏ

భగవద్గీతలో తెలియని రహస్యమును ఆ శ్లోకములో తెలియ చెప్పడమైనది. ప్రపంచములో ప్రత్యక్షముగా యున్నది, అయినా ఇంతవరకు ఎవరికీ తెలియని రహస్యముగా యున్నదంటే, ఆ శ్లోకము యొక్క వివరమును మీరే చదివి చూడండి. అంతగొప్ప వివరమును కేవలము పదకొండు శ్లోకముల తర్వాతే అందించడము నేను చేసుకొన్న అదృష్టము వలన అందరికంటే ముందు నాకు అర్థమయినదని అనుకొన్నాను. చాలామందికి మా రచన అయిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** ను చదివిన వారికి ఇటువంటి శ్లోకముల భావములు ఎన్నో అర్థము కాలేదని చెప్పవచ్చును.

నేను ముస్లీమ్‌ల పవిత్ర గ్రంథమయిన "అంతిమ దైవగ్రంథము" అని పేరుగాంచిన ఖురాన్ గ్రంథమును వ్రాయడము జరిగినది. హిందువులు ఎవరూ ముస్లీమ్ గ్రంథములను ముట్టుకోను కూడా ముట్టుకోరు. అయినా నేను హిందువునయి వుండి ముస్లీమ్‌లకే ఇంతవరకు అర్థముగాని ఖురాన్‌ను వ్రాయడము జరిగినది. ఇక్కడ 'నేను' అని మీకు అర్థమగుటకు చెప్పు చున్నాము. మాలోవుండి వ్రాసినది ఆత్మయేనని మరువకూడదు. ఇక్కడ భగవద్గీతలో ఎన్నో సంచలన విషయములను క్రొత్తగా చెప్పినట్లు, ఖురాన్ గ్రంథములోని ఆయత్‌లకు వివరమును చెప్పడమైనది. ఎవరికీ మ్రింగుడు పడనివి, ఇంతవరకు అర్థముకాని విషయములను వివరముగా చెప్పడమైనది. భగవద్గీతలో సాంఖ్యయోగమున 22వ శ్లోకము యొక్క వివరము వేయి సంవత్సరములు విజ్ఞాన పరిశోధనలు చేసినా తెలియని రహస్యముగా గలదు. అదే శ్లోకమువలె ఖురాన్‌లో సూరా ఆరులో, ఆయత్ 95 ఉన్నది. భగవద్గీతలో శ్లోకముండగా ఖురాన్‌లో ఆయత్ (వాక్యము) అదే భావము కల్గియున్నది. భగవద్గీతలో ఈ శ్లోకము ఎవరికీ అర్థము కానప్పుడు, ఖురాన్‌లో ఆ వాక్యము ఎవరికీ అర్థము కానిదైవున్నదని చెప్పడములో

ఆశ్చర్యము ఏమీలేదు. భగవద్గీతను చదివినా, వివరమును చదివినా ఉన్నది చదువగలరేగానీ లేనిదానిని, దాగియున్న దానిని గురించి ఎవరూ ఆలోచించరు. ముస్లీమ్‌లలో చాలామంది వినేవారేగానీ చదివేవారు తక్కువ. చదివేవారున్నా గానీ వారికి వచ్చిన భాషలో కాకుండా అరబ్బీ భాషలో చదువవలెనను నియమము గలదు. అరబ్బీ భాషలో చదువుట వలన ఆ భాష అర్థము తెలియని దానివలన ఖుర్‌ఆన్‌లోని ఈ వాక్యము యొక్క వివరము ఎవరికీ తెలియలేదు. భగవద్గీతలో చెప్పిన శ్లోకము ఖురాన్‌లో ఆయత్ రూపముగా ఉండగా బైబిలు గ్రంథములో ఆ విషయమే చెప్పలేదు. హిందువులలో ఉన్నా, ముస్లీమ్‌లలో ఉన్నా అది అర్థము కాలేదు, వివరమును ఎవరూ చెప్పలేదు, బైబిలులో అసలుకు లేదు. అందువలన **"గర్భస్థ శిశువుకు ప్రాణము లేదు"** అను విషయము ప్రపంచమునకే తెలియలేదని చెప్పవచ్చును. యావత్ ప్రపంచమునకే తెలియని రహస్యము నాకు నా చేత వ్రాయబడిన భగవద్గీతలో తెలియబరుచడము నా అదృష్టము కాదా! ఈ విధముగా నా చేత వ్రాయబడిన భగవద్గీతలో ఎన్నో రహస్యములు బయటపడినాయి. మీరు చదివితే వాస్తవము తెలుస్తుంది.

మానవ శరీరము విశ్వవిద్యాలయము కాగా, అందులో బోధకుడు ఆత్మయని చెప్పాము. విద్యార్థులు జీవాత్మలుకాగా, అన్నిటినీ చూచే పర్యవేక్షనాధికారిగా పరమాత్మ గలదు. శరీరము విద్యాలయము అయితే దానికి అధిపతి ఆత్మయే. ప్రపంచములో ప్రతి జీవునికి ప్రత్యేకమయిన శరీరముండుట వలన వానికి ప్రత్యేకమయిన విద్యాలయమున్నదని చెప్పవచ్చును. బయట విద్యాలయములలో ఎంతమంది విద్యార్థులయినా ఉండవచ్చును. అయితే జీవుని విషయమునకు వస్తే ఒక్కొక్కనికి ఒక్కొక్క శరీరమునిచ్చి ఒక్కొక్క విద్యాలయమును ఏర్పాటు చేసినట్లయినది. **ప్రతి**

**శరీరము ఒక విశ్వ విద్యాలయమే** ప్రతి శరీరమందు ఆత్మ బోధకుడుగా, చోధకుడుగా, కార్యకర్తగా అన్ని విధములా పని చేయుచున్నది. ఆ విధముగా ఒక్క జీవునికి ఒక్క విద్యాలయమును ఉంచుట ద్వారా జీవుళ్ళకున్న భావములను బట్టి వారికి బోధలు చెప్పనగును. అలా కాకపోతే వారివారి భావములకు తగిన బోధలు చెప్పుటకు వీలుండదు. అందువలన జీవుళ్ళు ఎందరున్నారో అన్ని శరీరములు గలవు. ప్రతి శరీరము ఒక విశ్వవిద్యాలయముగా యున్నది.

ప్రతి శరీరములోను బోధకుడుగా ఆత్మయుంటూ తెలియని విషయములను బోధగా చెప్పుచున్నది. అట్లే ప్రతి శరీరములో యున్న ఆత్మ శరీరమునకు అధిపతిగా యుంటూ శరీరమును ఎప్పుడు ఆరోగ్యముగా ఉంచవలెనో, ఎప్పుడు అనారోగ్యముగా ఉంచవలెనో కర్మరీత్యా లెక్కించి అలాగే చేయుచున్నది. ఆత్మ ప్రతి శరీరములో కార్యకర్తగాయుంటూ కర్మ ప్రకారము జీవునికి కావలసిన ప్రతి పనిని చేయుచున్నది. శరీరములో మాటలు వచ్చినవాడుగా అన్ని మాటలను మాట్లాడుచున్నది. శరీరములో ఆత్మ తెలియనివాడుగా యుంటూ, ప్రతి పనిని నేనే చేయుచున్నానని అజ్ఞానులతో అనిపించుచున్నది. కొంతమంది భక్తులలో ప్రతి కార్యమును దేవుడే చేయిస్తున్నాడని పలికించుచున్నది. కొందరిలో వైద్యుడుగా యుండి వైద్యము చేయించుచూ ఇతరులతో డాక్టరుగారని పిలిపించుచున్నది. కొందరిలో పాటలు పాడు గాయకుడుగాయుండి పాటలను పాడించు చున్నది. వందమంది గాయకులలో వంద రకములుగా యున్న ఆత్మ ఒక్కొక్కరికి ఒక్కొక్క గాత్రమును ఇచ్చి పాడించుచూ, ఎంతోమందిలో ఎన్నో తేడాలను చూపించుచున్నది. అందరూ సంగీతమును పాడువారే అయినా వారివారి కర్మనుబట్టి వారిలో ఎన్నో తేడాలుగా పాడించి ఒక్కొక్కరిని ఒక్కొక్క

గాయకునికిగా చూపుచున్నది. కొందరిలోనో లేక ఒక్కరిలోనో ప్రత్యేకమయిన గాత్రమునిచ్చి, ఆత్మే పాడుచూ వారిని అందరూ మెచ్చు కొనునట్లు, మంచిగాత్రము గలవాడని పొగడునట్లు చేయుచున్నది. ఈ విధముగా ప్రపంచములో కోటిమందిలో యుండి కోటి పనులు చేయుచూ, అందరినీ ఒకరికొకరు సంబంధము లేనట్లు చూపుచున్నది. అందరిలో ఒకే ఆత్మయున్నదను విషయమే ఎవరికీ తెలియకుండా చేయుచున్నది. విశ్వమంతా అన్ని శరీరములలోనున్న ఆత్మ ఒక్క శరీరములో కూడా తన ఉనికిని చాటుకోకుండా అణిగియున్న ఆత్మగా యున్నది. అందువలన ఆత్మ తెలియకుండా పోయినది. జీవాత్మయిన నేనే శరీరములో యున్నానని ప్రతి ఒక్కడు అనుకొంటున్నాడు. కొందరు మాత్రము కొన్ని సందర్భములలో తనతోపాటు శరీరములో దేవుడు కూడా యున్నాడని అనుకొంటున్నారు. కొన్ని పనులు దేవుడు చేయుచున్నాడని బయటికి చెప్పుచున్నా, అన్ని పనులు తానే చేయునట్లు అంతరంగమున అనుకోవడము జరుగుచున్నది.

**ప్రశ్న :- ఆత్మ అందరిలో ఉంటూ ఎవరిలో లేనట్లు ఎందుకు నటించు చున్నది?**

**జవాబు :-** ఆత్మ అందరిలో ఉన్నమాటను మూడు దైవగ్రంథములలో ప్రత్యక్షముగా చెప్పియున్నారు. మూడు దైవగ్రంథములను వ్రాయించినది ఆత్మే అయినందున తనను గూర్చి గ్రంథములలో ఏమాత్రము దాచుకోకుండా పూర్తి సమాచారమును చెప్పియున్నది. అయితే అక్కడ చెప్పినప్పుడే జ్ఞానమును, అజ్ఞానమును చెప్పుచూ జ్ఞానులు మాత్రము నన్ను గుర్తింతురు, అజ్ఞానులు నన్ను తెలియలేరని చెప్పాడు. అందరిలో అన్ని రకములుగా యుండు తనను తెలియుటకు ఆధ్యాత్మిక జ్ఞానమను ఆత్మజ్ఞానము అవసరము అని కూడా చెప్పాడు. జ్ఞానమునుబట్టి తనను తెలియనగునని

గ్రంథములలో చెప్పియున్నాడు. అందువలన ఆత్మ లేనట్లు నటించడము లేదు. ప్రత్యక్షముగాయుండి పనులు చేయుచున్నది. అయినా మనుషులే అజ్ఞానముచేత ఆత్మను తెలియక యున్నారు. జ్ఞానము వలన తాను తెలియుదునని ఆత్మ చెప్పియుండగా, జ్ఞానము చేత మనుషులు ఆత్మను తెలియవచ్చును కదా! ప్రపంచములో జ్ఞానులని పేరుపెట్టుకున్న వారు కూడా ఆత్మజ్ఞానము లేనివారై, అజ్ఞానమను చీకటిలోయుంటూ, తాను వెలుగులో యున్నట్లు భ్రమించుచున్నారు. తమను తాము జ్ఞానులుగా వర్ణించుకోవడము, ఊహించుకోవడము జరుగుచున్నది. అందువలన ఆత్మ ఎవరికీ తెలియడము లేదు.

**ప్రశ్న :- శరీరము విద్యాలయము అనియూ, అందులో బోధింపబడునది విశ్వ విద్య అనియూ, విశ్వ విద్యను బోధించునది విశ్వ విద్యాలయము అని అనవచ్చును అన్నారు. మీరు చెప్పినట్లే మనుషుల శరీరములన్నియూ విశ్వ విద్యాలయములే అయితే, నేడు శరీరము ధరించిన వారిలో దాదాపు 99 శాతము పైన అధర్మమునే కల్గియున్నారు. అధర్మమును రూపు మాపుటకు దేవుడు భగవంతునిగా భూమిమీదికి వచ్చునని మీరే అంటున్నారు. శరీరము విశ్వ విద్యాలయమైనప్పుడు, ఆత్మే బోధకుడుగా యున్నప్పుడు శరీరములోనే ధర్మములను బోధించి అధర్మములను లేకుండా చేయవచ్చును కదా! అట్లు ఎందుకు చేయడము లేదు?**

**జవాబు :-** ఇది మంచి ప్రశ్నే! ఒకప్పుడు నాకు కూడా ఇదే ప్రశ్నే వచ్చినది. దానికి ఆత్మ జవాబు ఈ విధముగా కలదు. శరీరము ప్రకృతి నిర్మితమైనది. ప్రకృతికి సంబంధించిన శరీరములో ఆత్మ నివాసముంటూ జ్ఞానమునో, అజ్ఞానమునో బోధించుచున్నది. విశ్వమంతా అన్ని శరీరములలో ఆత్మ

యుండుట వలన, కొన్ని శరీరములలో ఆత్మ తన ధర్మములను బోధించుట వలన శరీరమును విద్యాలయమనియు, విశ్వ విద్యాలయమనియు చెప్పుచున్నాము. విశ్వ విద్యాలయములు రెండు రకములనీ, శరీరము లోపలి విశ్వ విద్యాలయము ఒక రకముకాగా, శరీరము బయట మరొక విశ్వ విద్యాలయము కలదని చెప్పుకొన్నాము. దేవుడు భగవంతుడుగా వచ్చినప్పుడు ఆయన ఎక్కడ జ్ఞానమును చెప్పితే అక్కడే విశ్వ విద్యాలయముండునని చెప్పాము. ఈ విధమైన రెండు విద్యాలయములలో శరీరము లోపల గల వానియందు మనిషి (జీవుడు) కర్మనుబట్టి, జీవుని శ్రద్ధనుబట్టి, వాడు ప్రశ్నించే దానినిబట్టి ఆత్మజ్ఞానమును చెప్పుచుండును. ముఖ్యముగా చెప్పితే జీవుడు కోరుకున్న జ్ఞానమునే ఆత్మ చెప్పును. మనిషి అజ్ఞాన మార్గమును కోరుకొన్నప్పుడు ఆత్మ వానికి అజ్ఞానమునే బోధించును. వాని ఆసక్తి అంతయూ అజ్ఞానము మీదనే వుండి అజ్ఞానమునే తెలియాలను కొన్నప్పుడు వానికి అజ్ఞానమునే ఆత్మ బోధించును. ఈ విషయమును గురించి దైవగ్రంథములలో **"తనకు నచ్చిన వానికి ఆత్మ సన్మార్గమును చూపును. తనకు నచ్చని వానికి చెడు మార్గమును చూపును"** అని చెప్పియున్నారు. దేవున్ని వదలి దేవతల వైపు పోవు వారికీ, దేవుని వాక్యములకు తప్పు అర్థములను జోడించి ప్రజలను తప్పుదారి పట్టించు వారినీ, ఆత్మ అజ్ఞానమునే బోధించి తప్పుదారి పట్టించును. దేవుని మీద శ్రద్ధయున్నవానికి సరియైన జ్ఞానమును బోధించి మంచి జ్ఞాన మార్గమును పట్టించును. ఆత్మ శరీరములో అధికారిగా యుండుట వలన, జ్ఞానము మీద శ్రద్ధయున్న వానికి జ్ఞానమునే చెప్పి జ్ఞానమార్గమునే చూపును. జ్ఞానము మీద శ్రద్ధ లేని వానికి, వానికి తగినట్లు అజ్ఞానమునే బోధించి, జ్ఞానమును ఏమాత్రము అర్థము కాకుండా చేసి, వానిని అజ్ఞాన మార్గములోనే

పంపగలదు. శరీరములోని ఆత్మ మనిషి విధానమునుబట్టి, వాని మనో భావమునుబట్టి వర్తించగలదు. మనిషికి జ్ఞానమును బోధించి జ్ఞానమార్గములో అయినా పంపగలదు. లేకపోతే మనిషికి అజ్ఞానమును బోధించి అజ్ఞాన మార్గములోనయినా పంపగలదు. ఆత్మ ఎలా అనుకుంటే అలా చేయగలదు. జ్ఞానము అజ్ఞానము మనిషి యొక్క శ్రద్ధా అశ్రద్ధల మీద ఆధారపడి యుండును. కర్మలనుబట్టి కష్టసుఖములను అందించు ఆత్మ, శ్రద్ధలను బట్టి జ్ఞాన అజ్ఞానములను ఇచ్చును. అందువలన కొందరికి శరీరములో మంచిగయున్న ఆత్మ, కొందరికి చెడుగాయుండును. కొందరి పుణ్యమును బట్టి సుఖములను అందించు ఆత్మ, కొందరి పాపములను బట్టి నరకమును చూపించును.

ఆత్మ శరీరములో యుండి మనిషి కర్మలనుబట్టి ప్రపంచ సుఖ దుఃఖములను, శ్రద్ధలనుబట్టి జ్ఞాన అజ్ఞానములను అందించునని తెలుసు కొన్నాము. మనిషిలో అశ్రద్ధ, అజ్ఞానము వలన అహము ఎక్కువగా యుండుట వలన జ్ఞానముకంటే అజ్ఞానమునే ఎక్కువగా ఇవ్వవలసిన అవసరము ఏర్పడుచున్నది. అంతేగానీ లోకములోని మనుషులను జ్ఞానులుగా మార్చు నిమిత్తము జ్ఞానమును బోధించదు. అందువలన భూమిమీద అజ్ఞానమే పెరుగుతూ వచ్చినది. ఆ విధముగా ఆత్మయే అజ్ఞానమును బోధించినది. ఆత్మ తన ఇష్టము ప్రకారము ఏదీ చేయక తాను చేయు పనులకు కారణముంటేనే చేయును లేకపోతే చేయదు. అందువలన మనిషి కర్మనుబట్టి ప్రపంచ విషయములను నిర్ణయించి చేయును. అలాగే వాని ఆసక్తినిబట్టి దైవ సంబంధ జ్ఞానమును అందించును. అట్లు కాకుండా ఏదీ స్వయం నిర్ణయము తీసుకోదు. శరీరమునకు ఆత్మే అధిపతియైనా తన ఆధిపత్యమును, అధికారమును మనిషి కర్మలనుబట్టి

ప్రపంచ సంబంధముగా, శ్రద్ధలనుబట్టి దైవ సంబంధముగా నడుపును. మనిషిలో దైవము మీద శ్రద్ధ లేనిదానివలన ప్రపంచములో అజ్ఞానము పెరుగుచూ వచ్చినది. మనిషిని ఆత్మే అజ్ఞానము వైపు పంపినది.

భూమిమీద అజ్ఞానము పెరిగిపోయి ధర్మములు తెలియకుండా పోయి, అధర్మములు చెలరేగిపోయినప్పుడు, దేవుడు మనిషి రూపములో యుండు భగవంతునిగా వచ్చి ధర్మములను బోధించి కొంతవరకు అధర్మముల వారిని ధర్మముగల వారిగా మార్చును. అదియంతయూ బయట ప్రపంచము విధానములో భగవంతుడు చేయుపనిగా యుండగా, శరీరము లోపల మాత్రము మనిషి శ్రద్ధ, అశ్రద్ధలను బట్టి జ్ఞానమును అజ్ఞానమును రెండింటినీ ఆత్మ బోధించుచున్నది. దీని ప్రకారము అంతరంగము లోని విశ్వ విద్యాలయములలో జ్ఞానమును బోధించినట్లే, అజ్ఞానము కూడా బోధించబడును. బాహ్య విద్యాలయములో కేవలము ధర్మములను మాత్రము బోధింతురు. అంతరంగమున బోధకుడు ఆత్మకాగా, బయట బోధకుడు శరీరముతో వచ్చిన భగవంతుడని చెప్పవచ్చును. లోపలి విశ్వ విద్యాలయమునుగానీ, బయటి భగవంతుడు చెప్పు విధానమునుగానీ తెలియనివాడు దేవుని విధానమును ఏమాత్రము తెలియని వాడుగా యుండును. అందువలన రెండు విధానములను తెలియాలి.

శరీరములోని ఆత్మ, జ్ఞానమును అజ్ఞానమును రెండింటినీ బోధించగా చివరకు అజ్ఞానమే ఎక్కువయిపోయి అధర్మములకు స్థానము ఏర్పడినది. లోపలి ఆత్మ కర్మమును, శ్రద్ధనుబట్టి నడువవలసియుండుట వలన, ఆత్మ తన పాత్రను సక్రమముగా పోషించినా, వరకు కొంత కాలమునకు ధర్మముల స్థానములో అధర్మములు నిలబడుచున్నవి. అలా

మార్పు చెందిన దానిని లేకుండా చేసి తిరిగి ధర్మములను నెలకొల్పుటకు ఆత్మ కాకుండా పరమాత్మ అవసరమున్నది. అయితే పరమాత్మ ఏమీ చేయువాడు కాడు. ఊరకయుండువాడు మాత్రమే. అందువలన పరమాత్మ ఒక ఉపాయము చేత తిరిగి ధర్మ ప్రతిష్ఠాపన చేయ పూనినాడు. దేవుడు దేవుడుగా కాకుండా మారువేషములో, మారుపేరుతో ఏమయినా చేయవచ్చును. అలా చేయుట వలన ఆ పనిని దేవుడు చేసినట్లు లెక్కింప బడదు. కావున అధర్మములు చెలరేగినప్పుడు దేవుడు భగవంతుని వేషములో ఏదో ఒక మారుపేరుతో భూమిమీదికి వచ్చి తన ధర్మములను తిరిగి ప్రతిష్ఠించి పోవును. దేవుడు భగవంతునిగా వచ్చుట అరుదుగా ఉండును. అనగా ధర్మములు అధర్మములుగా మారుట అరుదుగా జరుగును. దీనినిబట్టి ఒక్కమారు దేవుడు భగవంతునిగా వచ్చి ధర్మప్రతిష్ఠాపన చేస్తే అది చాలా కాలము వరకు అట్లేయుండును. చాలా కాలము గడువగా శరీరములో ఆత్మ అవసరమును బట్టి ధర్మములను, అట్లే అవసరమునుబట్టి అధర్మములను బోధించుట వలన కొంత కొంతగా అధర్మములు అభివృద్ధి చెందుతూ వచ్చి చివరకు తారాస్థాయికి చేరును. అప్పుడు తిరిగి భగవంతుడు రావలసి యుండును.

ప్రశ్న :- **మనుషులలో అజ్ఞానము కూడా ఆత్మ వలననే అభివృద్ధి అగుచున్నదని తెలియుచున్నది. మనుషులు స్వయముగా జ్ఞానమును నేర్చలేరు, అట్లే అజ్ఞానమును నేర్చలేరని తెలియుచున్నది. ఆత్మకు జ్ఞానము అజ్ఞానము రెండు తెలిసినప్పుడు శ్రద్ధలేని వారికి కూడా జ్ఞానమునే బోధించి యుంటే, దేవుడు భూమిమీదికి భగవంతునిగా రావలసిన పనే లేదు కదా! ఆత్మ ఆ పనిని చేసియుంటే దేవుడు భూమిమీద పుట్టవలసిన పనే లేదు కదా!**

**జవాబు :-** ఆత్మ ప్రణాళికా బద్ధముగా శరీరములో యుండుట వలన ఆత్మ కర్మనియమములను, శ్రద్ధ కొలతలను అనుసరించి నడువవలసియుండును. అందువలన ఆత్మ తన నియమములను పాటించుచూ నడువవలసి యుండును. మనిషియొక్క కర్మ నియమములను అనుసరించుట వలన భూమిమీద అనగా బయటి ప్రపంచములో అన్యాయములను, అక్రమాలను ఆత్మే మనుషుల ద్వారా చేయవలసి వచ్చినది. చెడు పని అయిన ఒక దొంగతనము జరిగినప్పుడు, ఆ దొంగతనములో పెళ్ళి కొరకు ఎత్తిపెట్టుకొన్న కట్నము డబ్బులు పోయి, పెళ్ళి నిలిచిపోయి, పెళ్ళి కూతురు అవమానముతో ఆత్మహత్య చేసుకొని చనిపోయింది. చనిపోయిన పెళ్ళి కూతురును చూచి ప్రతి ఒక్కరూ కంటతడి పెట్టుకొన్నారు. మనుషులు ఏ పనినీ స్వయముగా చేయలేరు. మనిషిలో యున్న ఆత్మ మనిషిని బొమ్మవలె కదిలించి మనిషి ద్వారా పని చేయించుచున్నది. బాగా ఆలోచిస్తే ఈ దొంగతనము పనిని అంతటినీ ఆత్మే మనిషి ద్వారా చేసినది. పెళ్ళి నిలిచిపోయి పెళ్ళికూతురు చనిపోవడము బాధాకరమైన విషయమే అయినా, అంతటి బాధాకరమైన కార్యమును మొత్తము ఆత్మే చేసినది. ఆత్మకు కూడా ఇది బాధాకరమైన విషయమని తెలుసు. వారు గత జన్మలో చేసుకొన్న పాపమునకు పరిహారముగా బాధను అనుభవించవలసియున్నది. వారి పాపమును అనుభవింపజేయుటకు దానిని కార్యరూపముగా చేయవలసిన అవసరమున్నది. కార్యమును చేయునది ఆత్మే అయినందున, దొంగలో యుండి దొంగతనము చేసినది ఆత్మయే. అలాగే పెళ్ళి కూతురును బాధకు గురిచేసి చివరకు చంపినది కూడా ఆత్మే. అందరి శరీరములలోనున్న ఆత్మ పాపమును కార్యరూపముగా చేసి అనుభవింపచేసినది.

ప్రతి పని వెనుక ఆత్మపాత్రయున్నదని మనుషులకు తెలియకుండా పోయినది. ఒక పనికి కావలసిన సంకల్పమునుండి పని అంతయూ జీవుడే చేసినట్లు జీవునికి తెలిసి జరుగుచుండుట వలన, ప్రతి జీవుడు ఆ పనిని తానే చేశానని భ్రమించుచున్నాడు. ఆత్మ పనిని చేసినా తాను చేసినట్లు ఆత్మ ఎక్కడా బయటపడలేదు. ఆత్మ ప్రతి శరీరములోను అణిగియుండి బయటికి తెలియకుండా అన్ని పనులకు కారణము అగుచున్నది. ఇట్లు ప్రణాళికాబద్ధముగా శరీరములో ఒక పాప కర్మనుబట్టి నడుచుట ఇప్పుడు చూచాము కదా! ఇక్కడ జరిగిన కార్యము దొంగతనము, చేసినది ఒక దొంగ అని అందరికీ తెలుసు. అయితే ఆ దొంగ ఎవరు? అనేచోట అందరము భ్రమపడి పైకి కనిపించు వానినే దొంగయని అంటున్నాము. వాస్తవముగా నేనే దొంగయని ఆ మనిషి కూడా అనుకోవడము జరుగుచున్నది. అయితే బయటికి కనిపించకుండా శరీరములోపలయున్న ఆత్మే నిజముగా దొంగతనము అను కార్యమును చేసినవాడు అని ఎవరూ గ్రహించలేకపోయారు. ప్రణాళికాబద్ధుడయిన ఆత్మ పాపకర్మనుబట్టి చెడుగా ప్రవర్తించి పని చేయవలసివచ్చినది. అటువంటి పాపమునుండిగానీ, పుణ్యమునుండిగానీ ఆత్మ తప్పించు కొనుటకు వీలులేదు. మనిషి కర్మలను అనుసరించి ఆత్మ శరీరములో పని చేయవలసియున్నది. ఈ విధముగానే మంచి కర్మలయిన పుణ్యముల ఎడల, చెడు కర్మలయిన పాపముల ఎడల నియమబద్ధుడై ఆత్మ పని చేయవలసి యున్నది.

కర్మల ఎడల ఎట్లు ఆత్మ పని చేయుచున్నదో, మనిషియొక్క శ్రద్ధను బట్టి జ్ఞాన విషయములలోనూ, అశ్రద్ధనుబట్టి అజ్ఞాన విషయములలోనూ

ఆత్మ నియమబద్ధముగా పని చేయుచున్నది. జ్ఞాన విషయములలో ఎట్లు నియమబద్ధముగా ఆత్మ పని చేయుచున్నదో, కొన్ని విషయములను ఉదాహరణగా తీసుకొని చూచినట్లయితే ఆత్మయొక్క విధానము పూర్తిగా తెలియును. ఒక వ్యక్తి దేవుని విధానములో భక్తిగలవాడనని చెప్పుకొనెడివాడు. దైవ గ్రంథములు కూడా చదివెడివాడు. అయితే ప్రపంచ విషయములతో పోల్చి చూస్తే ప్రపంచ విషయముల మీదున్నంత శ్రద్ధ దైవ విషయముల మీద లేదని తెలిసినది. ఆ మనిషి తనకున్న శ్రద్ధ తక్కువ అని అనుకోకుండా తనదే పెద్ద శ్రద్ధయని, తానే సక్రమ మార్గములో యున్నానని అనుకొనెడివాడు. దైవగ్రంథములోని వాక్యములకు తనకు అర్థమయినదే సరియైన అర్థమని అనుకొనెడివాడు. తనకంటే పెద్ద జ్ఞానులనయినా లెక్కచేయక వారికంటే తానే ఎక్కువ తెలిసినవాడినని అనుకొనెడివాడు. ఒక దినము దైవజ్ఞానమునకు సంబంధించిన ఒక గ్రంథమును చదివి దానిలోని వాక్యములను అర్థము చేసుకోవాలని ప్రయత్నించాడు. అక్కడ అతనికి అర్థమయినది అర్థమవగా అదే నిజమైన అర్థమని అనుకొన్నాడు. కొన్నాళ్ళకు ఇతర జ్ఞాని అతనివద్దకు వచ్చినప్పుడు అతనికి కూడా ఆ వాక్యమును చెప్పి వివరమును చెప్పాడు. అప్పుడు ఇతర జ్ఞాని ఆ వాక్యము యొక్క అర్థము మీద కొంత అనుమానమును వ్యక్తము చేశాడు. అయితే జపాతా అనునతడు తనదే సరియైన అర్థమని చెప్పగా, వచ్చిన జ్ఞాని కూడా అదే నిజమయివుండవచ్చునని జపాత అర్థమునే సరియైనదనుకొన్నాడు. మొదట జపాత అనువాడు గ్రంథమునుండి అర్థము చేసుకొన్న జ్ఞాన విషయమును ఇతర జ్ఞానులకు కూడా చెప్పడము వలన అదే సరియైన జ్ఞానమని నమ్మిన వారందరూ అతను చెప్పినట్లే నడుచుకొనెడివారు.

వాస్తవముగా గ్రంథములో తూనీగ అని వ్రాయబడియుండగా జపాత దానిని ఈగగా అర్థము చేసుకొన్నాడు. తూనీగ అంటే పెద్ద ఈగ అని అర్థము చేసుకొన్న దానివలన ఈగ జాతిలోనే పెద్దగయుండు ఈగను తూనీగ అని అంటారనుకొన్నాడు. తూనీగ అంటే దాని జాతియే వేరని, సాధారణ ఈగలాంటిది కాదని జపాతకు తెలియలేదు. తూనీగ తోక పొడవుగా రెక్కలు పొడవుగా యుండగా, జంపు రెక్కలు లేనిది, పొడవు తోక లేనిది అయిన ఈగగా పోల్చుకొన్నాడు. అది తప్పని అనుకోక అందరికీ అదే చెప్పాడు. ఒక దినము వేరే ఊరినుండి గొప్ప జ్ఞాని వచ్చి జపాత చెప్పు ఈగను విని అది తూనీగకాదు అని చెప్పాడు. తూనీగ ఈగ జాతికాదు అని పక్షి జాతియని చెప్పగా జపాత మరియు అతని అనుచరులు (శిష్యులు) అందరూ 'లేదు తమ గురువు చెప్పినదే నిజమని' వాదించారు. క్రొత్తగా వచ్చి చెప్పిన వానిమాటను వినలేదు. అట్లే ఇంకొక చోట 'పడక పత్యము' అని వ్రాసియుంటే దానిని పగలు పత్యమని తలచి పగలు అన్నము తినకుండా ఉండేవారు. దానిని కూడా క్రొత్తగా వచ్చిన జ్ఞాని పడక పత్యము అని అంటే భార్యాభర్తలు కలుసుకోకుండా దూరముగా ఉండవలెనని చెప్పినా, జపాత మరియు అతని శిష్యులు పగలు పత్యమే సరియైన అర్థమని వాదించారు. తూనీగను ఈగగా, పడక పత్యమును పగలు పత్యముగా అనుకొని అదే సరైన అర్థమని జపాత అనుకోవడమునకు కారణము అతనికి ప్రపంచ విషయము మీదగల శ్రద్ధకంటే జ్ఞానము మీద శ్రద్ధ తక్కువగా యుండడమేనని తెలియుచున్నది.

శరీరములోని ఆత్మ **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"** అన్నట్లు వాని శ్రద్ధను బట్టి వానికి జ్ఞానము అర్థమగునట్లు చేసినది. ప్రపంచ శ్రద్ధ ఎక్కువ యుండుట వలన జ్ఞాన సంబంధ విషయములు కూడా ప్రపంచ

సంబంధ విషయములుగా కనిపించుచున్నవి. తూనీగ ఈగగా కనిపించినట్లు, పడక పత్యము పగలు పత్యములాగ కనిపించినది. ఈ విధముగనే అంతిమ దైవ గ్రంథములోని ఒక వాక్యమును తప్పుగా అర్థము చేసుకొని తాను ఆచరించడమే కాక తన శిష్యులందరినీ ఆచరింపజేశాడు. ఈ విధముగా తప్పుగా అర్థము చేసుకొనుటకు కారణము తన శ్రద్ధయని అతనికి అర్థము కాలేదు. శరీరములోని ఆత్మ వాని శ్రద్ధనుబట్టి పదములకు, వాక్యములకు తప్పు అర్థమును ఊహకు అందించడము వలన అతను తప్పు భావములో పోవడము జరిగినది. స్థూల దృష్టి కల్గిన ఒక వ్యక్తికి అన్నీ స్థూలముగనే అర్థమగునట్లు ఆత్మ చేయగలదు. అట్లే ఉన్న భావముకంటే వేరుగా కొద్ది ప్రక్క భావమును అందివ్వగలదు. తూనీగకు ఈగగా, పడక పత్యమునకు పగలు పత్యముగా కొద్ది భేదమును ఎట్లు కల్పించినదో అట్లే అన్ని విషయములలో ప్రక్క దారిలో పంపును.

దైవజ్ఞానమునకు సంబంధములేని విషయము పగలు పత్యము. వాస్తవముగా దేవుడు పగలు తినేదానికి ఇవ్వగా, రాత్రి భార్యలతో గడిపే దానికి కేటాయించాడు. పగలు తినే వస్తువులను తిని వాటి రుచిని అనుభవించుటకు నియమించి, పగలు ఆకలి కల్గునట్లు చేశాడు. అదే రాత్రిపూట భార్యలతో రమించుటకు ఏ కార్యములు లేకుండా విడిది కాలముగా యుంచాడు. అయితే ఆత్మ, జ్ఞానము మీద శ్రద్ధలేని వానికి ఈ విషయము తలక్రిందులుగా అర్థమగునట్లు చేసి, దేవుడు పెట్టిన నియమమునకు వ్యతిరేఖముగా నడచునట్లు చేయుచున్నది. నేను దేవుడు పెట్టిన నియమమునకు వ్యతిరేఖముగా నడచుచున్నానను ధ్యాస మనిషికి లేకుండా చేయుచున్నది. హిందువులుగా యున్నవారు భక్తికల్గి ఏదో ఒక దేవతకు మ్రొక్కుబడి చెల్లించుటకు ఉపవాసముండి, అనగా పగలు అన్నము

తినకుండా యుండి పూజలు చేయుచున్నారు. నవరాత్రి సమయములో పగలంతా ఉపవాసముండి రాత్రంతా తింటూ తిరుగుచూ, నిద్రను మేల్కొని జాగారము చేయుచున్నామని చెప్పుచుందురు. ఇక్కడ దేవుని నియమమును అతిక్రమించామని కొద్దిపాటుగా కూడా ఎవరూ అనుకోవడము లేదు. పైగా మాది భక్తియని కొందరూ, జ్ఞానమని కొందరూ చెప్పుకొంటున్నారు. ఎవడయినా ఆహారము తినకపోతే ఆత్మకు ఇబ్బందనీ భగవద్గీతలో శ్రద్ధాత్రయ యోగమున ఆరవ శ్లోకమందు చెప్పియున్నారని చెప్పినా భగవద్గీత మాటను కూడా లెక్కచేయరు. తమకు మనుషులు చెప్పిన మాటయే ముఖ్యమన్నట్లు ప్రవర్తించుచూ దైవగ్రంథములోని మాటలను లెక్క చేయకపోవడము జరుగు చున్నదంటే, అలా ప్రవర్తించునట్లు వానిలో వానికి తెలిసినదే ముఖ్యమని ఆత్మే తెలుపుట వలన అది తన నిర్ణయముగానే తలచి పొరపడుచున్నాడు. శరీరము విద్యాలయముగా ఉండగా, అందులో బోధించు బోధకుడు ఆత్మయని ఎవరికీ తెలియదు. ప్రపంచములో ఎవనిని జ్ఞానిగా తయారు చేయవలెనన్నా, ఎవనిని అజ్ఞానిగా తయారు చేయవలెనని అనుకొనినా వానిని అలాగే ఆత్మ తయారు చేయగలదు. జ్ఞానిగా, అజ్ఞానిగా రెండు విధములా తయారు చేయు స్థోమత ఆత్మకు గలదు. ఆత్మ మనిషి యొక్క భావమును బట్టి వానిని తయారు చేసి, తనకు ఏమీ తెలియనట్లుంటుంది.

ప్రశ్న :- **దేవుడు భగవంతునిగా రూపు మార్చుకొని వచ్చినప్పుడు భగవంతుని శరీరములో కూడా మూడు ఆత్మలుండునని గతములో మీరు చెప్పారు. ధర్మసంస్థాపనకు భగవంతుడుగా దేవుడు వస్తే భగవంతుని శరీరములో గల దేవుడు తన ధర్మములను తెలియజేస్తాడా? లేక శరీరములో యుండే ఆత్మ తన ధర్మములను గురించి చెప్పునా? ఆత్మ, పరమాత్మ ఇరువురు**

**కాకుండా భగవంతుని శరీరములో యుండు జీవాత్మనే దేవుని ధర్మములను తెలియజేయు స్థోమత కల్గియుండునా? ఇప్పుడు చెప్పండి?**

**జవాబు :-** ఇలా ప్రశ్నించడము వస్తే మీకు జ్ఞానము సులభముగా అర్థము కాగలదు. నాకు చెప్పేదానికి బాగుంటుంది. భగవంతుడు భూమిమీదకు వస్తే అతని శరీరములో మూడు ఆత్మలుండుట వాస్తవమే. అయితే అందులో జీవాత్మ, జీవాత్మ ధర్మములనే కల్గియుండును. అట్లే ఆత్మ, ఆత్మ ధర్మములను అతిక్రమించకుండా నడుచుకొనుచుండును. దేవుడు భగవంతుని శరీరములో యున్నా తన పద్ధతి ప్రకారము తాను ఉండును. మూడు ఆత్మలు సాధారణ శరీరములో యున్నట్లే యుండును, ఏమీ వ్యత్యాసముండదు. భగవంతుని శరీరములో యుండు దేవుడు తన ధర్మములను తెలియజేయడు. ఆయన ఎక్కడయున్నా తన ధర్మము ప్రకారము క్రియలు లేనివాడుగా యుండును. సాధారణ మనిషి శరీరములో యున్నట్లే భగవంతుని శరీరములో కూడా స్థబ్దతగా, సాక్షిగా యుండును. దేవుడు ఎట్లుండునో జీవుడు కూడా ఏ పనినీ చేయలేనివాడైయుండును. తెలియ చెప్పే స్థోమత జీవునికి ఎప్పటికీ లేదు, భగవంతుని శరీరములో కూడా జీవుడు చేతకానివాడై ఏ పనినీ చేయలేనివాడైయుండును. భగవంతుని శరీరములో యున్న జీవునికి ఏ రాయితీ లేదు.

ఇక భగవంతునిలోయుండు ఆత్మ విషయమునకు వస్తే ఆత్మ తన ధర్మము ప్రకారమే నడుచుకొనుచుండును. ఇప్పటికే మీకు కొంత అర్థమయి పోయివుండును. ఆత్మ జీవుని భావమును అనుసరించి ప్రవర్తించునని చెప్పాము కదా! అట్లే జీవునకున్న శ్రద్ధాశ్రద్ధలను బట్టి జ్ఞానమును, కర్మలను బట్టి కష్టసుఖములను కల్గించు పనులను చేయుచుండును. దేవుడు

భగవంతునిగా వస్తే తనను గుర్తుపట్టని విధముగా కర్మలను స్వయముగా సృష్టించుకొని (రచించుకొని) వచ్చును. ఆయన తయారు చేసుకున్న కర్మల ప్రకారము ఆత్మ పనులను కల్పించి భగవంతుడునికి సుఖ దుఃఖములను అనుభవింపజేయుచుండును. ఇకపోతే జీవునకు గల ఉద్దేశ్యమునుబట్టి భక్తిమార్గములో నడువునట్లు చేయును. జీవునికి జ్ఞానమార్గములో గల శ్రద్ధను బట్టి ఆత్మ ప్రవర్తించునని చెప్పాము. ఇక్కడ భగవంతుని శరీరములో భగవంతుడుగా వచ్చిన జీవుడు తన భావములో ప్రజలకు దైవధర్మములను తెలియజేసి, అధర్మములను ప్రజలలో లేకుండా చేయవలెనను శ్రద్ధను కలిగియుండుట వలన, జీవుని భావమునుబట్టి, శ్రద్ధనుబట్టి ఆత్మ ప్రవర్తించుట వలన, జీవుని ఉద్దేశ్యములో అజ్ఞాన సంబంధ భావములు లేనందున, ఆత్మ పూర్తిగా జ్ఞాన సంబంధ ధర్మములనే తెలియజేయుటకు పూనుకొనును. ఆత్మకు దేవుని ధర్మములనబడు తన ధర్మములు (ఆత్మ ధర్మములు) బాగా తెలిసియుండుట వలన దైవ ధర్మములనే చెప్పును. భగవంతుని మాటలలో ఎప్పుడు దైవధర్మములను బోధించవలెనో, ఎక్కడ బోధించవలెనో, ఎవరితో చెప్పవలెనో వారితోనే చెప్పును. కృష్ణునిగా వచ్చినప్పుడు సమయము చూచి ఎవరికీ తెలియని విధముగా, యుద్ధ రంగములో చెప్పడమైనది. అదియూ ఒక వ్యక్తికే ఒకమారే బోధించడమైనది. భగవంతుడుగా వచ్చిన తర్వాత 90 సంవత్సరముల వయస్సులో బోధించడము జరిగినది. ఎక్కడ, ఎలా, ఎవరికి చెప్పాలను విషయము ముందే ప్రణాళికాబద్ధముగా యుండును.

భగవంతుడు వచ్చినప్పుడు అతని శరీరములోని జీవాత్మకు ఉన్న ఉద్దేశ్యమునుబట్టి ఆత్మ బోధించును. భగవంతుని శరీరములో జీవుడు మానవులకు ధర్మములను తెలియజేయవలెనను ఉద్దేశ్యమును కల్గియుండుట

వలన ఆత్మ దైవధర్మములను పూర్తిగా బయటకు చెప్పును. భగవంతుని వలన ధర్మములను తెలియజేయడమును ధర్మప్రతిష్ఠాపనయని అన్నారు. భగవంతుని శరీరములోని ఆత్మ ధర్మసంస్థాపన జరుగునట్లు ధర్మములను బోధించడమేకాక, ఫలానా అధర్మములున్నవని తేల్చి చెప్పును. భగవంతుడు బోధించుట వలన ధర్మములు, అధర్మములు బయటి మనుషులకు తెలిసి పోవును. అప్పుడు ప్రజలు అధర్మములను వదలి, ధర్మములవైపు వచ్చుటకు ప్రయత్నింతురు. అలా ప్రయత్నము చేయగా కొంత కాలమునకు అధర్మ వరులందరూ లేకుండా మారిపోయి అందరూ ధర్మవరులుగా మారి పోవుదురు. భగవంతుని శరీరములో జీవునియందు ధర్మములను తెలియజేయవలెననే ఉద్దేశ్యము తప్ప, అతని భావములో ఏమాత్రము అజ్ఞాన సంబంధ భావములుగానీ, అజ్ఞాన ఉద్దేశ్యములుగానీ, అజ్ఞాన శ్రద్ధగానీ లేకుండుట వలన, భగవంతుడు స్వచ్ఛమయిన, ఏ అజ్ఞాన కాలుష్యము లేని జ్ఞానమును ధర్మసమేతముగా ఆత్మ బోధించడము జరిగినది. జీవున్నిబట్టి ఆత్మ జ్ఞాన, అజ్ఞానముగా ప్రజలందరిలో నడువగా, భగవంతుని శరీరములో గల జీవుని భావమునుబట్టి ఆత్మ కేవలము జ్ఞాన పద్ధతిగానే నడువవలసి వచ్చినది, అలాగే బోధించినది. ఆత్మ స్వయముగా ఏమీ చేయదు. అంతా జీవున్నిబట్టి యుండును అని అన్నట్లు భగవంతుని శరీరములోని జీవున్నిబట్టి ఆత్మ ప్రవర్తించినది.

మిగతా మనుషుల శరీరములో జీవుడు అజ్ఞాన భావముతో యుంటే అజ్ఞానమును, జ్ఞాన భావముతో యుంటే జ్ఞానమును బోధించు ఆత్మ, మిగతా ప్రజలలో అజ్ఞానమును జ్ఞానమును రెండింటినీ బోధించినది. ప్రతి మనిషి ఎక్కువ అజ్ఞాన భావములు, తక్కువ జ్ఞాన భావములు కల్గియుండుట వలన అలాగే ఎక్కువ అజ్ఞానమును తక్కువ జ్ఞానమును బోధించుచూ

రాగా కొంత కాలమునకు అనగా యుగము కాలమునకు (కొన్ని లక్షల సంవత్సరములకు) భూమిమీద జ్ఞానము లేకుండా అంతా అజ్ఞానముగా మారిపోవుట వలన అధర్మములు వృద్ధి పొంది ధర్మములు లేకుండా పోతున్నవి. దేవుడు భగవంతునిగా ధర్మ సంస్థాపనార్థము వచ్చుట వలన భగవంతుని శరీరములోని జీవుని భావమునుబట్టి ఆత్మయే ధర్మ సంస్థాపన చేయుచున్నది. అధర్మములు వృద్ధినొందుటకు అందరి శరీరములు వేదిక కాగా, ధర్మములు వృద్ధినొందుటకు భగవంతుని శరీరము ఒక్కటే వేదికగా యున్నది.

**ప్రశ్న :- దేవుడు మనిషిగా వచ్చి సాధారణ మనుషులవలె శ్రమపడకుండా భూమిమీద ఉన్న మనుషులలోనే జ్ఞానులుగా యున్నవారిలో గొప్ప వానిని గుర్తించి, వానిలో ధర్మములు తెలియవలెనను భావమును కల్గించి, వాని భావము ప్రకారము ఆత్మ ధర్మములను తెలియజేయవచ్చును కదా! ధర్మములను తెలియజేయునది ఆత్మే యగుట వలన జ్ఞానము కల జీవునిలో మార్పు తెచ్చి, వానిని అనుసరించి ఆత్మ ధర్మములను తెలియజేయవచ్చును కదా! దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** అలా చేస్తే దేవుడు కూడా మనుషులకంటే హీనముగా దిగజారి పోయినట్లగును. దేవుడు తన భగవద్గీతలో ఒకచోట "కర్మ విసర్గః" అన్నాడు. కర్మమును అతిచిన్నగా విభజించి చూచుటను కర్మ విసర్గము అని అంటారు. ప్రతి మనిషిని కర్మ ప్రకారము నడుపుటయే ఆత్మ యొక్కపని. కర్మ విసర్గము ప్రకారము ప్రతి చిన్న కర్మను కూడా ఆత్మ అమలు చేయును. ఆత్మ ఎవని కర్మను తొలగించదు, ఎవని కర్మను పొడిగించదు. ఆత్మ తన ధర్మమును అతిక్రమించి ఎప్పుడూ ప్రవర్తించదు. ప్రతి చిన్న కర్మను అనుసరించి ఆత్మ పని చేయవలసియున్నది. అందువలన ఆత్మ స్వయముగా ఏ నిర్ణయము

తీసుకోదు. ఎవనిలోనూ లేని భావములను కల్పించదు. ఉన్న భావమును తొలగించదు. జీవున్ని మార్చి చేసిందనుకో అప్పుడు ఆత్మకంటే దేవుడు పెద్దయను భావము లేకుండా పోవును. దేవునితో పనియే లేకుండా పోవును. దేవుని పాత్ర ఏమాత్రము లేనందున దేవుడు ఉన్నా ఒక్కటే లేకున్నా ఒక్కటేయగును. ప్రపంచమునంతటినీ ఆత్మయే తన ఆధీనములోనికి తీసుకొన్నట్లగును. అట్లు కాకుండా ఆత్మ తన పనిని తాను చేస్తే ఆ తర్వాత మిగతా కార్యమును దేవుడు భగవంతుని రూపములో చేయును. దేవుని పరిపాలనలో కర్మ అతి సూక్ష్మాతి సూక్ష్మముగా యుండుట వలన దానిని ఆత్మ తప్పక నెరవేర్చవలసియున్నది. అలా కాకుండా ఆత్మ స్వయముగా ప్రవర్తించదు, స్వయం నిర్ణయములు తీసుకోదు. తన ధర్మము ప్రకారము మనిషిని అనుసరించి జ్ఞానమును గానీ, అజ్ఞానమునుగానీ తెలియుజేయును. ఆత్మ ఎప్పటికీ దేవుని ధర్మము ప్రకారము ప్రవర్తించునుగానీ, దేవుని ధర్మమును అతిక్రమించదు.

జ్ఞానులలో ఉత్తమోత్తమమయిన జ్ఞాని ఎవడయినా ఉన్నాడంటే అతనికున్న పది క్షణములలో ఒక్క క్షణమైనా అజ్ఞాన భావము కల్గియుండును. ఎవడూ అజ్ఞాన భావము పూర్తిగా లేనివాడు ఉండడు. అజ్ఞాన భావము లేనివాడు పుట్టనే పుట్టడు. ముందుజన్మలో కర్మ శేషము ఉండినవాడే పుట్టును. పుట్టిన ప్రతివానికి పాపపుణ్య మిశ్రమము ఉన్నట్లు భావములు కూడా మంచి, చెడు మిళితమైవుండును. అట్లే జ్ఞాన అజ్ఞాన శ్రద్ధలు కల్గియుండును. బుద్ధి రెండు విధ యోచనలు చూపడము సహజము బుద్ధివలె ప్రతివాడు జ్ఞాన అజ్ఞాన రెండు భావములు కల్గియుండును. భూమిమీద వీడు పెద్దజ్ఞాని అని పేరుగాంచిన వానిని చూచినా, ఎక్కువ జ్ఞానసాంద్రత కల్గియున్న వానిని పరిశీలించి చూచినా, వానిలో నూటికి

పది శాతమయినా అజ్ఞానముండును. అటువంటప్పుడు ఆత్మ వాని అజ్ఞానమువలె ప్రవర్తించవలసి యుండును. పూర్తి జ్ఞాన భావములు నూటికి నూరు పాళ్ళు గలవారు లేరు. అందువలన ఆత్మ నూటికి నూరుపాళ్ళు జ్ఞానమును బోధించదు. తన బోధ వలన అధర్మములు పెరిగినా, దానికి తగిన విధముగా ధర్మ స్థాపన చేయుటకు దేవుడు ముందే తన ప్రణాళికను సిద్ధము చేసి యుంచాడు. అలా ఉన్నప్పుడే దేవుడు దేవునిగా లెక్కించ బడుతాడు. దేవుడు భగవంతునిగా రాకపోతే ఏ సంబంధములేని దేవునితో ఎవరికీ పని లేదు. అటువంటప్పుడు దేవుడున్నా ఒక్కటే, లేకపోయినా ఒక్కటేయగును.

ఇప్పటికే ఆత్మకు ఆస్తి అంతా వ్రాసి ఇచ్చినట్లు, శరీరములోని సర్వ హక్కులు ఆత్మకు ఇచ్చి శరీరమునకు ఆత్మను అధిపతిగా చేసి యుంచడము వలన, శరీరమునకు అంతటికీ రాజు ఆత్మ అయివున్నది. శరీరములో పరమాత్మ యున్నప్పటికీ అధికారము లేనివానిగా కదలక మెదలక యుండ వలసి వచ్చినది. పరమాత్మ ఉనికి ఎక్కడ ఏమాత్రము తెలియుటకు అవకాశమేలేదు. దేవుడు బయటికి తెలియు అవకాశము ఒక్కటే గలదు. అప్పుడు కూడా రాకుండా చేసి ఆ పనిని కూడా మేమే చేస్తాము అనడము పరమాత్మ ఉనికిని ఏమాత్రము తెలియకుండా చేయడమే యగును. అందువలన అది మంచి పనికాదు. దేవుడు ఎప్పటికీ అధిపతిగా ఉండగా, ఆయన క్రింద పరివారముగా ఆత్మ నుండి మిగతా వారందరూ ఉండవలెను. ఎవరి పని వారికున్నప్పుడే దేవుని ప్రణాళిక సరిగా జరిగినట్లగును. అన్ని విధముల ఆలోచించి ఏది సరియైన పనియో దానినే దేవుడు నిర్ణయించి యుంచాడు. దేవుడు నిర్ణయించిన కర్మబద్ధ చట్టమును మనుషుల ఎడల గానీ, ఆత్మ ఎడలగానీ మార్చలేము. దేవుడు నిర్ణయించినది నిర్ణయించినట్లే జరుగును. అదియే ఉత్తమ పద్ధతి.

జీవాత్మ, ఆత్మ, పరమాత్మ మూడు ఒకే పండులోని భాగములే. అందులో పరమాత్మ దేవుడుగా పూర్తి గొప్పగా ఉండగా ఆత్మ, పరమాత్మ తర్వాత రెండవ స్థానములో యుండి, పరమాత్మ ఆజ్ఞతో శరీరములయందు నడువడము విధిగా చేయబడినది. మూడవ భాగమైన జీవాత్మ, పరమాత్మ, ఆత్మలకంటే చిన్నదిగాయుంటూ శరీరములో అన్ని అనుభవములను పొందు చుండును. మిగతా ఆత్మ, పరమాత్మ అనుభవము లేనివారుగా ఉండగా, జీవుని అనుభవముల కొరకే ఆత్మ, పరమాత్మ ఇద్దరు పని చేయుచున్నారు. శరీరములో పరమాత్మ కొరకు ఎవరూ పని చేయలేదు. అలాగే ఆత్మ కొరకు కూడా ఎవరూ పని చేయలేదు. అయితే జీవాత్మ కొరకు ఆత్మ, పరమాత్మ ఇద్దరూ పని చేయవలసియున్నది. జీవుని కొరకు ఆత్మ, పరమాత్మ ఇద్దరూ పనిచేయుచుండగా, జీవాత్మ ఏమీ చేయక ఆ ఇద్దరూ అందించినవి అనుభవిస్తున్నాడు. "శరీరములో అన్నీ అనుభవించువాడిని నేను ఒక్కనినే. నాతో సమానముగా ఎవరూ ఏమీ అనుభవించడము లేదు. పని చేయకుండా అనుభవించే వాడిని నేనే గొప్పకాదా!" అని జీవాత్మ అజ్ఞానము చేత అప్పుడప్పుడు అనుకొనుచుండును.

ప్రశ్న :- **శరీరమను విశ్వ విద్యాలయములో విద్యార్థులు జీవులు అని తెలిసినది. విశ్వ విద్యాలయములో బోధించు బోధకుడు ఆత్మ అని తెలిసినది. విశ్వ విద్యాలయములకన్నిటికీ ప్రిన్సిపాల్ (సూత్రధారి) అయిన దేవుడు ఒక్కడేయని తెలిసినది. విద్యార్థి అయిన జీవుడు బోధకుడయిన ఆత్మకు, సూత్రధారి అయిన పరమాత్మకు ఎవరికి దగ్గరగా ఉండును? ఎవరిని ఎక్కువగా ప్రేమించును?**

**జవాబు :-** శరీర విశ్వ విద్యాలయములో బోధించువాడు ఆత్మయని జీవునికి

తెలియదు. విశ్వ విద్యాలయ సూత్రధారి అయిన దేవుడే బోధిస్తున్నాడని అనుకోవడము వలన నిజముగా బోధించువాడు ఆత్మయని జీవునికి తెలియకుండా పోయినది. దేవుడే నిత్యము జీవునికి దగ్గరగా యున్నాడని జీవుడు అనుకోవడము జరుగుచున్నది. వాస్తవముగా జీవునికి దగ్గరగా యున్నవాడు ఆత్మ అయితే జీవునికి ఆత్మంటూ ఒకటున్నదను విషయమే తెలియని దానివలన శరీర విశ్వ విద్యాలయములో జీవుడు, దేవుడు ఇద్దరే ఉన్నారని అనుకోవడము వలన, జీవుడు తనకు దగ్గరగా దేవుడున్నాడని అనుకోవడమైనది. జీవుని లెక్కలో ఆత్మంటే ఎవరో తెలియదు. ఇతరులు ఆత్మను గురించి చెప్పినా వినేటట్లు లేదు.

**ప్రశ్న :- "ముక్తి కొరకు మూడు విద్యలు" అన్నారు. ఆ మూడు విద్యలను ఎవరు నేర్పుతారు? ఎక్కడ నేర్పుతారు?**

**జవాబు :-** ముక్తి కొరకు మూడు విద్యలుండుట వాస్తవమే. ఆ మూడు విద్యలను నేర్పువాడు ఆత్మయే. ఆత్మ తప్ప ఇతరులు నేర్పేవారు ఎవరూ లేరు. శరీరమే విశ్వ విద్యాలయముగా యుండుట వలన శరీరములోనే ఈ మూడు విద్యలను నేర్పవలసి యున్నది.

**ప్రశ్న :- మూడు విద్యలు ఏవి?**

**జవాబు :-** సాత్త్వికము, రాజసము, తామసము అను మూడు రోగములను కలిపి "మాయ" అని అంటున్నాము. మాయ రోగము మనుషులను ఆవహించి యుండుట వలన ఆ మూడు విధముల మాయ రోగము పోవాలంటే దానికి సరియైన మూడు మందులు గలవు. ఆ మందుల పేర్లు **కర్మయోగము, బ్రహ్మయోగము, భక్తియోగము** అను మూడు

యోగములు గలవు.  ఈ మూడు యోగములలో ఏ ఒక్క యోగము చేతనయినా మాయ రోగము నివారణ కాగలదు.  చిన్న వయస్సు నుండి అరవై (60) సంవత్సరముల వరకు కర్మయోగమును ఆచరించవచ్చును. తర్వాత కూడా కర్మయోగమునే ఆచరించవచ్చును.  బ్రహ్మయోగము చేయాలనుకొనువారు 50 లేక 60 సంవత్సరముల వయస్సునుండి ఆచరించుటకు అనుకూలముగా ఉండును.  ఇకపోతే భక్తియోగమును ఆచరించవలెనని అనుకొనువారు  చిన్న వయస్సు నుంచి ఏ వయస్సులో నయినా ఆచరించవచ్చును.  భక్తియోగము జీవితము అన్ని దశలలో సరిపోవును.  కర్మయోగము కూడా అంతేగాయుండును.  జీవితములో ఎప్పుడయినా ఆచరించవచ్చును.  ఒక్క బ్రహ్మయోగము మాత్రము ఆచరించడములో జాగ్రత్త వహించవలసిన పని యున్నది.  ఆరోగ్య అనారోగ్య సమస్యలను చూచుకొని చేయవలసియుండడమే కాక  బాధ్యతలు లేని జీవితము గలవారికి  యాభై సంవత్సరముల పై వయస్సున్న వారికి సరిపోవునని అనుకొంటున్నాను.  కర్మ, బ్రహ్మ, భక్తి అను మూడు యోగములలో ఏది ఆచరించినా, దానివలన త్రిగుణ మాయనుండి బయటపడవచ్చును.

**ప్రశ్న :- "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా"  ఈ శ్లోకములో 'దైవము అయిన నేను తయారు చేసిన మాయ' అని చెప్పబడినది. "నన్ను శరణు పొందిన వాడు తప్ప  ఎవరూ నా మాయను దాటలేరు" అని అన్నారు. ఇక్కడ దైవము అంటే ఎవరు? ఆత్మయని అర్థము చేసుకోవాలా? లేక పరమాత్మనా? మాయను తయారు చేసినది ఎవరు? శరణు ఎవరిని వేడాలి? ఎలా వేడాలి?**

**జవాబు :-** "మాయ" అనునది త్రిగుణ నిర్మితమైనది. మూడు గుణములను కలిపి **మాయ** అని అంటున్నాము. మాయను జయించుట దుస్సాధ్యమని చెప్పబడియున్నది. మాయను స్వయముగా దేవుడే తయారు చేశాడు. అందువలన అది దైవ నిర్మితమైనదని చెప్పారు. ఇక్కడ అందరికీ ఒక ప్రశ్న రాగలదు. అదేమనగా! దేవుడు దేనినీ చేయువాడు కాదు, క్రియా రహితుడు అని అన్నారు కదా! అలాంటప్పుడు దేవుడు మాయను ఎలా తయారు చేశాడు? దేవుడు పని చేయనివాడైనప్పుడు మాయను తయారు చేయలేదనియేగా అర్థము అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలా కలదు. దేవుడు స్వయముగా పనిచేసి మూడు గుణ భాగములను, వాటిలో 36 గుణములను, అందులో చీలికలయిన చిన్న గుణములను 108గా చేశాడు. ఒక్కొక్క గుణ భాగములో 108 గుణములుండగా, మూడు గుణ భాగములలో 324 మొత్తము గుణములు గలవు. ఈ మొత్తము గుణములను కలిపి **"మాయ"** అని పేరు పెట్టబడినది. మాయ అను గుణములను దేవుడే స్వయముగా తయారు చేసి యుండుట వలన ఆ మాయను దాటుట చాలా దుస్సాధ్యమైన పనిగాయుండును. ఎంతటి వాడయినా మాయను దాటుట దుస్సాధ్యము.

'దేవుడు పని చేయనివాడు' అను మాట సత్యమే. అయితే ఆ మాట ఎప్పటినుండి వర్తించును అని ఆలోచిస్తే సృష్ఠికి పూర్వము దేవునికి వర్తించు నియమములు సృష్ఠి తర్వాత వర్తించవు. సృష్ఠికి పూర్వము దేవుడు పని చేయువాడుగాయుండి, సృష్ఠిని దేవుడే తయారు చేసి, సృష్ఠికి అనుబంధముగా యున్న అన్నిటినీ మాయతో సహా తయారు చేయడమైనది. ఖగోళములోని భూతములను, గ్రహములను, భూగోళములోని మనుషులను, జంతువులను క్రిమికీటకములను మొదలగు వాటిని తయారు చేసి సృష్ఠిని

సృష్టించి తర్వాత దేవుడు ముందే నిర్ణయించుకొన్న తన ధర్మముల ప్రకారము నడుచుకోగా, అట్లే ముందే నిర్ణయించబడిన ధర్మముల ప్రకారము ఆత్మ, జీవాత్మ ప్రవర్తించను మొదలుపెట్టాయి. అప్పటినుండి ఇప్పటి వరకు దేవుడు సృష్టి పూర్వము తయారు చేసిన ధర్మముల ప్రకారమే జగతి నడుస్తున్నది. మాయను ఆత్మ తయారు చేయలేదు. పరమాత్మయనబడు దేవుడే అందరినీ, అన్నిటినీ సృష్టించాడు. సృష్టి పూర్వము దేవుడే మాయను రచించిన వాడు అయినందున తన శ్లోకములో **"మమమాయా"** నా మాయ అని అన్నాడు. దేవుడు తయారు చేసిన మాయ దేవున్ని శరణు పొందినప్పుడు తన బలము తగ్గించును. అందువలన "మా మామేవయే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే" అని అన్నాడు. అందువలన మాయ బలమును తగ్గించుకొనుటకు దేవున్నే వేడుకోవాలి.

**ప్రశ్న :- ఇంతకుముందు "ఆదిత్య" గ్రంథములో "దైవబోధకు సంకల్పము దేవునిది, కార్యము ఆత్మది. అలాగే అధర్మముల బోధకు సంకల్పము మాయది పని ఆత్మది" అన్నారు. ఇప్పుడు ఈ గ్రంథములో "ధర్మములకు గానీ, అధర్మములకుగానీ ఆత్మే కారణము అనీ, ఆత్మే కార్యకర్తయనీ అంటున్నారు. ఇంతకుముందు "ఆదిత్య" గ్రంథములో 'సంకల్పము దేవునిది' అన్న దానిని, 'సంకల్పము మాయది' అన్న దానిని ఎలా అర్థము చేసు కోవాలి? సంపూర్ణ వివరము అందించగలరని ప్రార్థించుచున్నాము?**

**జవాబు :-** ఈ విషయములకు అన్నిటికీ ముందే జవాబు వచ్చినది. అది మీకు అర్థము కాలేదు కనుక మీరు తిరిగి అడగడమైనది. ఇప్పుడు పూర్తి వివరముగా చెప్పెదను వినుము. **"ఆదిత్య"** గ్రంథములో దైవబోధకు సంకల్పము దేవునిది, అధర్మముల బోధకు సంకల్పము మాయది అని

చెప్పిన మాట నిజమే. అక్కడ అట్లే చెప్పవలసియున్నది. ఆత్మ అన్ని పనులు చేయుచున్నా ధర్మములకు, అధర్మములకు సంకల్ప ప్రేరణ చేయునది ఆత్మే అయినా, తనను బయటికి చెప్పుకోకుండా ఇతరుల మీద ఆ పనిని చెప్పడము ఆత్మకు సహజము. ఆత్మ చేసిన పనిని తాను చేశాను అని చెప్పదు. తన ఉనికిని బయటపెట్టదు. జ్ఞానము పనులను దేవుని మీద త్రోయడము, అజ్ఞానపు పనులనుగానీ, అజ్ఞాన సంకల్పములనుగానీ మాయ మీద త్రోయడము ఆత్మకు సహజమే. అందువలన సంకల్ప ప్రేరేపణ తానే చేసినప్పటికీ మంచిదేమో దేవునిమీద, చెడుదేమో మాయమీద త్రిప్పి చెప్పింది ఆత్మేనని తెలియవలెను. ఇప్పుడు మనకు ఆత్మ విషయము తెలిసింది కావున వెనుతిరిగి వివరమును అడుగుచున్నాము. ఆత్మ విషయము తెలియకపోతే ఆత్మ చెప్పినదే నమ్మేవారము. అప్పుడు నిజముగా ధర్మమును దేవుడు, అధర్మములను మాయ సంకల్పించినదని అనుకొనే వారము. ఆత్మ విషయము తెలియని వారంతా అలాగే అనుకొంటున్నారు. వాస్తవముగా చెప్పితే ప్రతి పనికీ ఆత్మే ప్రేరేపించి, ప్రతి దానినీ కార్యకర్తగా చేయుచున్నది.

**ప్రశ్న :- ఆత్మకు విశ్రాంతి యుండదా? విశ్రాంతి లేకుండా పని చేస్తుందా?**

**జవాబు :-** ఆత్మ సర్వ కాల, సర్వ వేళలయందు ఎరుక కల్గియుండి, విశ్రాంతి లేకుండా యున్నది. ఒక్క క్షణము కూడా ఊరకయుండక కర్మ పరిపాలన చేయుచునే యున్నది.

**ప్రశ్న :- మనిషి నిద్రపోయినప్పుడు నిద్రలో జీవుడు ఏ కర్మను అనుభవించడు కదా! నిద్రలో ఆత్మకు కర్మపాలన లేదు కదా! అప్పుడు విశ్రాంతి తీసుకొంటుందా?**

**జవాబు :-** కర్మపాలన రెండు రకములుగా యుండును. బయట అనుభవించు సుఖదుఃఖములు, అంతరంగమున అనుభవించు సుఖదుఃఖములు అని రెండు రకములు గలవు. బయటి అనుభవములు అందరికీ తెలిసినవే. లోపలి అనుభవములు నిద్రలో వచ్చు స్వప్నములో కల్గుచుండును. స్వప్నములలో కూడా ఆత్మయుండి జీవున్ని అనుభవింపజేయుచున్నది. ఈ విధముగా తీరిక లేకుండా ఆత్మ పనిని చేయుచున్నది.

**ప్రశ్న :- నిద్రలో స్వప్నము లేని సమయములో ఆత్మకు పని లేదు కదా! అప్పుడు ఆత్మకు విశ్రాంతియే కదా!**

**జవాబు :-** శరీరమును విశ్వ విద్యాలయమని చెప్పాము కదా! శరీరమున కంతటికీ ఆత్మే అధికారి కదా! తన ఆధీనములోయున్న శరీరమును తానే చూచుకోవలెను. దానిని ఎల్లవేళలా బోధించు బోధనాలయముగా పెట్టుకోవలెను. శరీరము బాధ్యతయంతా ఆత్మదే అయివుండుట వలన, జీవుడు నిద్రించు సమయములో కూడా శ్వాసకోశమును సక్రమముగా నడిపించు చుండును. జీర్ణాశయమును కూడా ఆత్మే సక్రమముగా నడిపించు చుండును. రక్తప్రసరణ విషయములో కూడా జాగ్రత్తగాయుండును. ఇట్లు ఆత్మ నిద్ర, మెలుకువ, స్వప్నములలో కూడా పని చేయుచున్నది.

**ప్రశ్న :- ఆత్మ విషయములలో చాలా లోతుగా మీరు చెప్పుచున్నారు కదా! ఆత్మ శరీరములో అణిగియుండి ఎవరికీ తెలియనిదిగా యున్నదని చెప్పారు కదా! అణిగియున్న ఆత్మను మీరు ఎప్పుడయినా చూచారా!**

**జవాబు :-** ఆత్మ ఎవరికీ తెలియకుండా శరీరములో అణిగియున్నది వాస్తవమే. అందువలన అది ఎవరికీ కనిపించలేదు. అంతేకాకా ఆత్మ శరీరము లోపల యుండుట వలన అది ఎవరికీ కనిపించనిదై యున్నది.

ఆత్మ స్థూల ఆకారములేనిది, సూక్ష్మ ఆకారము గలదిగా యున్నది. సూక్ష్మ ఆకారమును చూడవలెనంటే జ్ఞానదృష్ఠి అవసరము. జ్ఞానదృష్ఠి అనగా సూక్ష్మముగా యున్న వాటిని చూడగలది. సాధారణ మనుషులు శరీరములో సూక్ష్మముగా యున్న మనస్సు, బుద్ధినే చూడలేదు. ఆ రెండింటికంటే పెద్దదయిన ఆత్మను ఎలా చూడగలరు? మనోబుద్ధిని చూడలేనివారు ఆత్మను చూడలేరు.

**ప్రశ్న :- మీరు మనో బుద్ధిని చూశారా? మీకు జ్ఞాననేత్రమున్నదా?**

**జవాబు :-** జ్ఞాననేత్రమున్నదో లేదో నాకు మాత్రము తెలియదు. అయితే నేను మాత్రము మనస్సును చూచాను, బుద్ధిని చూచాను. మనస్సును, బుద్ధినే కాదు ఏకంగా ఆత్మనే చూచాను. మనస్సును బుద్ధిని చూడగల జ్ఞానదృష్ఠియున్నప్పుడు ఆత్మను కూడా సులభముగా చూడవచ్చును. ఆత్మను చూచాను కావుననే ఆత్మ వివరమును చెప్పుచున్నాను. ఆత్మ ప్రత్యేకముగా ఉన్నదని, ప్రత్యక్షముగా ఇతరులకు చెప్పిన వానిని నేనేయని ధైర్యముగా చెప్పగలను. అంతేకాక ఆత్మను చూచిన మొదటి వానిని నేనేయని కూడా ధైర్యముగా చెప్పుచున్నాను.

**ప్రశ్న :- భూమిమీద ఎందరో స్వామీజీలు, బాబాలు, గురువులు, పీఠాధిపతులు, మఠాధిపతులు, సన్యాసులు, తపస్వీకులు, యోగులు ఉన్నారు కదా! వారు ఎవరూ చూడని ఆత్మను మీరు చూచారా?**

**జవాబు :-** వారి కథ నాకు తెలియదు. నేను ఆత్మను ఇప్పుడే కాదు ఎప్పుడో కొన్ని పదుల సంవత్సరముల క్రితమే చూచాను. నేను ఒక్కనినే చూచాను అని కూడా చెప్పుచున్నాను. మీరు చెప్పిన మిగతా వారికి ఆత్మయొక్క వాసన కూడా తెలియదు. అలాంటప్పుడు వారు ఆ దృశ్యమును ఎలా చూడగలరు?

**ప్రశ్న :- మీరు ఆత్మను చూశాను అనడమేకాక మనో బుద్ధిని కూడా చూచాను అని అంటున్నారు. అది గర్వముతో, అహముతో దురహంకారముగా చెప్పుమాటగా మేము అనుకోవచ్చును కదా!**

**జవాబు :-** నా మాట అసత్యమైతే మీ మాటకు ప్రాణమున్నట్లే. నా మాట సత్యమైతే మీ మాటకు ప్రాణమే లేనట్లే. నాకు తెలిసి మీరు ప్రాణము లేని మాటను మాట్లాడుచున్నారు. నా యొక్క బాహ్యారంగ ముక్కు ముఖమును చూస్తున్నారు తప్ప, నా అంతరంగములోని రూపమును మీరు చూడడము లేదు. మనో బుద్ధిని చూచాను అని ధైర్యముగా చెప్పుచున్నాను. అంతేకాక నేను తప్ప ఎవరూ చూడలేదని కూడా చెప్పుచున్నాను. మనో బుద్ధినే కాకుండా నేరుగా ఆత్మనే చూచాను అని చెప్పుచున్నాను. అయితే మీరు విశ్వసించడములేదు. నేను దేవున్ని మాత్రము చూడలేదు. నేను ఎప్పటికీ దేవున్ని చూడను, చూడవలసిన అవసరము నాకు లేదు. ఇంతకంటే ఎక్కువగా మీతో ఏమీ చెప్పను.

ఇట్లు

**యోగీశ్వర్**

**సమాప్తము**

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

---

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# Vishwa Vidyalayam



ఒకప్పటి ప్రబోధానంద యోగీశ్వరులు


Author :

The Only GURU of Three Religions

The Spiritual Emperor, Thraitha Theorem Originator

Sri Acharya Prabodhananda Yogeeshwarulu



www.thraithashakam.org